విఫలులైనారు. మాధవపెద్ది వస్త్రాపహరణంలో చేసుమాత్రం వెయ్యలేకా అని హాహాకరించి విఫలులైనారు. ప్రజలకు ఏ కొత్త తెలిపించలేమిటంటే యడవల్లివారి దుర్యోధనుడు ఈర్ష్యాళువు. మాధవపెద్ది వారి దుర్యోధనుడు కార్యశాలి. వారికి వారేసాటి—వీరికి వీరేసాటి—ఈ తీర్పుకు నాటికీ నేటికీ తిరుగులేదు.

అవి నాటకరంగానికి ఉజ్వలమైన రోజులు. బెల్లంకొండవారి కృష్ణుడు, మాధవపెద్దివారి దుర్యోధనుడు, బలిజేటివారి కర్ణుడు, అద్దంకివారి ధర్మరాజు, పంచాంగంవారి అర్జునుడు, మద్దాలివారి భీముడు-బందారుపల్లి ఆంజనేయులు అశ్వత్థామ, దైతగోపాలంగారి ధృతరాష్ట్రుడు—ఆ నాటకం చూచాము బందరులో నే చదువుకునే రోజుల్లో—మంచి యౌవనంలో ఉన్న మాధవపెద్ది—శరీరానికి అంతా రంగు వేసుకుని—ముత్యాలు కట్టినట్టి పంచె బిగించికట్టి—తళతళలాడే కిరీటాన్ని ధరించిన శిరస్సు విసురుతూ—భుజంమీద గద ధరించి—కండలు తేలిన శరీరం—ఛాతి విరుచుకుంటూ "రాజేయుండును నేను తమ్ములను సంగ్రామంబులో నిల్వ—నాకో భీముండెదురెంచుగాక-ఎదురనెక్కెంటే"—అని ప్రశ్నిస్తే కాదనటానికి పాండవులకూ గుండె లేకపోయినవి. కృష్ణుడే అవునని అంగీకరిస్తూ-ఇతని మాయోపాయంవల్ల కాని జయించడం సాధ్యం కాదని నిర్ణయానికి వచ్చాడు. ఆ మాధవపెద్దివారి ఆనాటి దుర్యోధన మూర్తి నాటికీ నేటికీ నాకు క్షణ క్షణం సాక్షాత్కరిస్తోంది. "సమరము సేయుకే బలముచాలిన" అని ఆనాటి మాధవపెద్ది సింహగర్జన నాటికీ నేటికీ నా కర్ణపుటాల్లో ప్రతిధ్వనిస్తూనే ఉంది. చేతులు జోడించి వినయం ఉట్టిపడుతూ శివికి లోటు రానీయకుండా ద్రోణాచార్యునివద్ద నిలిచి "కౌరవేంద్రుడు మహాత్మ మీకు కృప ఈగతి వచ్చిన ఏమి సేయుదున్" అనే పలుకులు గురువు శిష్యుల సంబంధాన్ని తూచి చెప్పాయి. సహాయం కోరడానికి వచ్చినా పొరపాటున కృష్ణుని పాదాలవైపు ఆసీనుడై తలపరికించి తిరిగి శిరస్సువైపున ఆసీనుడైన మాధవపెద్ది జన్మతః అంతటి ఔచిత్యశాలి యేమో అనిపించింది. ధర్మరాజు ఆభరిరంగంలో "నీకే ఆయుధము కావలసిన అది ఇచ్చెదము-అది గైకొని మావీరులలో నీ ఇచ్చ వచ్చిన వారితో పోరి విజయము గైకొమ్ము" అని ఔదార్యం చూపిస్తే అంతకంటె ఔదార్యంతో "దచ్చిన భీమసేనుని చేతనే చచ్చెదను—గెలిచిన భీమసేనునే గెలిచెదను" అని నిర్ణయించిన మాధవపెద్ది సహజంగా అభిజాత్యసంపన్నుడని అందరికీ స్పష్టమైంది. ద్వంద్వయుద్ధానికి ముందు—దుర్యోధనుడు భీమునితో "చేతిలావును, బుద్ధికౌశలమును మండవలయును గాని పూజా పురస్కారములతో గదారణకోవిదుండ వగుదువా" అని ఎకసక్కెము లాడినప్పుడు మాధవపెద్ది సహజంగా నిత్యం కసరత్ చేస్తూ కుస్తీలలో ప్రావీణ్యం కలవాడని అందరికీ తేటతెల్లమైంది. రాయబారంలో ధృతరాష్ట్రునితో పాండవుల జన్మహక్కును శంకిస్తూ "యమానిలేంద్రాశ్వినిలో తమ్ములు" అని చదువుతూ తన మాటల ప్రభావం కృష్ణుని పైన ఎలా వుందో అని ఒక ముసుక్కుమనే మెరపులాటి చూపు కృష్ణునివైపు విసిరేసరికి వేలాది ప్రేక్షకులుకూడా ఆ చూపుకు దాసులై దాన్ని అనుసరించి తాముకూడ కృష్ణునివైపు చూచేవారు—అంటనే మాధవపెద్ది మెచ్చుతెలిసిన మాంత్రికుడనుకునే వారు. దారుభంగమై—మూర్ఛాస్తమయమును గనునిసు తన శరీరమునకై కాచుకున్న నక్కలను హెచ్చరిస్తూ తండ్రి నుద్దేశించి కన్నీరుతో "ముసలితనమున విధవ కూతురు దిక్కులేని విధి లిఖించె" అనే మాటలు పలుకుతూంటే ప్రేక్షకులంతా కన్నీరు విడుస్తూ దుర్యోధనుని స్థితికి జాలిపడేవారు—అతని ఒక్క చూపులో—ఒక్క మాటలో—ఒక్క కదలికలో—ప్రేక్షకులకు రసోదయమయ్యేది.

నటులు అనేక పద్ధతులు అవలంబిస్తుంటారు. భరత శాస్త్రం మొదలు ఈనాటి సానిస్లావిస్కీ శాస్త్రంవరకు అనేక నటనా పద్ధతులు నిర్వచింపబడ్డాయి. అన్ని శాస్త్రాల్లోనూ చివరకు చెప్పబడిందేమిటంటే—మేం ఇన్ని పద్ధతులు చెప్పినా, ఇవి శాశ్వతమైనా ఆదేశాలు కావు. ప్రతి నటుడు తనకు తాను ఆలోచించి తన పద్ధతులు తానే స్వతంత్రంగా ఆలోచించుకోవాలి అని వ్రాశారు. శాస్త్రానికి నటుడు అంటిపెట్టుకోవడం అంత మంచిది కాదని నిత్యనూత్న అనుభవవిజ్ఞానంతో తాను ధరించిన పాత్రకు వ్యాఖ్యానం చేస్తూ—తాను వ్యాఖ్యానించిన మూర్తిని ప్రేక్షకులకు సాక్షాత్కరింప చేయాలన్నారు. నిన్నటి నాటకంలో చేసిన విధంగా ఈనాడుకూడా నటుడు అభినయిస్తే అతనికి అనుభవ లోపం అన్నారు. అతని విజ్ఞానం పెరగడం లేదన్నారు. అతని పాత్రకు చైతన్యం కొరతపడిందన్నారు. మాధవపెద్ది దుర్యోధన పాత్రలో నిత్యం నూత్న పోకడలు కనిపించేవి. నటుడు సర్వాంగసుందరుడై—మంచి జన్మ కలిగి—జన్మాంతర సంస్కృతి కలిగి

"రూపవాన్, మధురాభాషీ...శ్రుతీ వాగ్మీ పటుస్తథా
కులాంగో నాతిస్థైర్య—శాస్త్రజ్ఞో మధురస్వరః
ప్రతిభావాన్"

ఉండాలన్నారు నందికేశ్వరులు. ఆవన్నీ మాధవపెద్దిలో మూర్తీభవించినవి. ఒకానొక పాశ్చాత్య శాస్త్రవేత్త—"పాత్రం వల్లించడమే కాదు — పాత్రం వెనకాలుండే భావాన్ని — భావోద్రేకాన్ని కూడా వల్లించాలి నటుడు" అన్నారు. ఇది చాలామందినటులకు చేతకాదు. భావోద్రేకాన్నికూడా వల్లించి ఎప్పుడు కావాలంటే అప్పుడు దాన్ని ప్రేక్షకులకు విపించి చూపించేవాడు మాధవపెద్ది. సాత్వికాభినయరీతుల్లో "సంధిప్రకాశ రోమాంచ స్వేదోద్వేపథుః అశ్రువైస్వర్యం" అని నిర్వచించారు. ఇవన్నీ మాధవపెద్దికి కరతలామలకాలైనాయి. అంగ ఉపాంగ ప్రత్యంగాలతో తన ఇచ్ఛవచ్చినట్లు అదుపుతో నటించడమే కాక — సహజ ఆహార్యంలో విశిష్టమైన వాచికంలో—అద్వితీయమైన సాత్వికం ప్రదర్శించేవాడు. సామాన్యంగా స్నేహితులతో మాట్లాడినా రోమాంచం సాక్షాత్కరించేది. అతని దుర్యోధన పతనంతోనే అంతమైంది. అది మన దౌర్భాగ్యం.

మాధవపెద్ది మధురహృదయుడు. అతనితో స్నేహం కట్టడానికి యువకులు ఉవ్విళ్లూరేవారు. క్షణం పలకరిస్తే ఆదరించి ఆప్తులుగా చేసుకునేవాడు. యువకులంటే అతనికి అమిత ప్రాణం. అప్కదారులకు పెద్ద అండగావుండి పితృవ్యుడై మా తప్పటడుగులకు చేయూతనిచ్చి దిద్దుతూ ముందుకు తీసుకుపోయేవాడు. నేను కృష్ణ పాత్ర ధరించడానికి ఆయనే కారణం. బెల్లంకొండతో వున్న ఆయన మైత్రిని ప్రక్కకుతోసి నాకు చేయూత యిచ్చి ప్రోత్సహించి అవకాశం ఇచ్చి గుంటూరులో రసికజన సమక్షంలో—నా కృష్ణపాత్రను బహిరంగపరచి ఆశీర్వదించి, వీపు తట్టి, ముందుకు తీసుకువచ్చిన అమరజీవి మాధవపెద్దికి నా జోహారులు. మనకు నేడు మాధవపెద్ది లేడు. అతనితోపాటు దుర్యోధనుడూ లేడు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna
at The Andhra Patrika Press, 6 & 7, Thumbu Chetty Street, Madras-1,
Editor S. Sambhu Prasad.

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీ విలంబినామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి చినపూర్ణార్యసిద్ధాన్తినస్తృతీయపుత్రేణకృష్ణమూర్తిశాస్త్రిణాప్రణీతమ్

విఘ్నేశ! విధిమార్తండ చంద్రేంద్రోపేంద్రవందిత ! నమో గణపతే! తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే॥

వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్య దిందుమయీం।
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం॥

### గమనిక

ఈ సంవత్సరమున రాజు శుక్రుడు. మంత్రి సూర్యుడు. 8 ఖండములు వర్షము. సర్వసస్యసముదాయ మగు ౧౬ వీసములలో ౯ వీసములు పంట ఫలించును. శ్రీ కృష్ణుడు పశుపాలకు డగుటచే పశువులు తృణక్షీరాదిసమృద్ధి గలవి యగును.

చైత్ర బ. అమా. శ. అర్ధాధికగ్రాస సూర్యగ్రహణమున్ను, ఫాల్గున శు. పూర్ణి. మం. పాదగ్రాస చంద్ర గ్రహణమున్ను సంభవించును. అధిక శ్రావణ శుక్ల పంచమీ సో. న కావేరీ నదియందు పార్శ్వశ్రీకోటితీర్థసహిత పుష్కర ప్రవేశము.



### మౌఢ్యములు

ఆశ్వయుజ శుక్ల తృతీయా బు. రా॥ మార్గశిర శుక్ల ద్వితీయా శు. వరకు శుక్రమౌఢ్యము.

ఆశ్వయుజ శుక్ల అష్టమీ సో. రా॥ కార్తీక శుక్ల సప్తమీ సో. వరకు గురుమౌఢ్యము.

| | |
|---|---|
| కల్యాబ్దములు: | ౫౦౫౯ |
| శాలివాహన శక: | ౧౮౮౦ |
| ఫసలీసన్ | ౧౩౬౭-౬౮ |
| హిజరీసన్ | ౧౩౭౭-౭౮ |
| ఇం. సం. | 1958-59 |

ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు 1.

## పంచాంగ పద్ధతి వివరణము

ఇందు కాలమానము గంటలలో చూపబడినది. తిథి, నక్షత్రము ఘటికలలో గూడ చూపబడినవి. దినమానము భుక్తి గ్రహపాదప్రవేశములు ఘటికలలో చూపబడినవి. గంటలు అర్ధరాత్రినుండి చూపబడినవి. పగలు మధ్యాహ్నానంతరము 1-2 మొదలగు గంటలు 13, 14 మొదలగు సంఖ్యలచే చూపబడినవి. అనగా 12 గంటలకు లోపుగ నున్న కాలము మధ్యాహ్నమునకు పూర్వ మనియును 12 గంటలకంటె అధికముగనున్న కాలములో 12 ను తీసివేసి మధ్యాహ్నానంతర మనియు గ్రహింపవలయును. రాత్రి 12 గంటలు 24 గంటలుగ నుండును. రాత్రి 12 గంటలనుండి మరదిన సూర్యోదయమువరకు కాలము 1, 2, 3 మొదలగు గంటలు 'రా' అను గుర్తుచే వ్రాయబడినవి. 5-7 గంటల మధ్య నగు కాలము 'రా' అను గుర్తులేనిచో సూర్యోదయానంతర కాలముగ తెలియవలయును. సూర్యోదయమునుండి మరదిన సూర్యోదయమువరకు పూర్తిగ నున్నచో 'పూర్తి' అని వ్రాయబడెను.

భారతప్రభుత్వముచే నియమింపబడిన పంచాంగసంస్కరణ సంఘము (కాలెండరు రిఫారమ్ కమిటీ) వారి నిర్ణయప్రకారము పంచాంగ మంతయు చేయబడినది. ఇందలి తిథినక్షత్రాదులును గ్రహసంచారము మొదలగు గణితవిషయము లన్నియు నూతన సంస్కారములచే దృగ్గణితపద్ధతిగ వ్రాయబడినవి. కాని తిథి, నక్షత్రము బీజసంస్కారయుత సూర్యసిద్ధాంత పద్ధతి (పూర్వపద్ధతి)చే సాధింపబడినవి యున్ను వేరుగ చూపబడినవి. మాధ్వసంప్రదాయమువారు సూర్యసిద్ధాంత పంచాంగమునందు సంస్కార విశేషములను చేసి వాటింబట్టియే ఏకాదశ్యాదికము నాచరింతురు. కావున మాధ్వమతీయులును పుణ్యదినములును రామానుజ సంప్రదాయముచే నగు తిరునక్షత్రములున్ను పూర్వపద్ధతి పంచాంగమునందే చూపబడినవి. పంచాంగ సంస్కరణసంఘమువారిచే నిర్ణయింపబడిన అయనాంశలును, నిరయన మేషాదియు వేదాంగజ్యోతిషాదిప్రమాణసిద్ధములు. కాలభేదముచే మారిన ఋతుపరిణామమున్ను తెలియచేయబడినది. వర్షయోగములు, ధరలు, గోచారఫలములు, ధర్మశాస్త్ర నిర్ణయములు మొదలగునవి మామూలుగ వ్రాయబడినవి. పంచాంగము నంతయు చూచి గ్రహింపవలెను.

## దేశాంతర చక్రము

| పట్టణములు | మేష తులా | వృష కన్యా | మిథున సింహ | కర్కటక | వృశ్చిక మీన | ధనుః కుంభ | మకర |
|---|---|---|---|---|---|---|---|
| శృంగేరి | ౬౫ | ౮౩ | ౮౯ | ౭౧ | ౫౮ | ౫౧ | ౪౯ |
| మైసూరు | ౫౦ | ౬౦ | ౬౭ | ౮౨ | ౪౦ | ౩౨ | ౨౭ |
| బెంగుళూరు | ౪౨ | ౫౧ | ౫౭ | ౬౧ | ౩౩ | ౨౬ | ౨౩ |
| అనంతపురం | ౪౨ | ౪౮ | ౫౧ | ౫౩ | ౩౮ | ౩౩ | ౩౧ |
| కర్నూలు | ౩౮ | ౪౦ | ౪౨ | ౪౩ | ౩౪ | ౩౨ | ౩౧ |
| నెల్లూరు | ౧౮ | ౨౩ | ౨౮ | ౨౯ | ౧౦ | ౮ | ౫ |
| హైదరాబాదు | ౩౨ | ౩౧ | ౩౧ | ౩౦ | ౩౩ | ౩౩ | ౩౪ |
| తంజావూరు | ౨౮ | ౪౦ | ౫౧ | ౫౪ | ౧౪ | ౪ | ౦ |
| కంచి (కామకోటి) | ౨౦ | ౨౯ | ౩౮ | ౩౯ | ౧౧ | ౩ | ౧ |
| వరంగల్లు | ౨౪ | ౨౩ | ౨౩ | ౨౨ | ౨౫ | ౨౫ | ౨౬ |
| బెజవాడ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౪ | ౧౧ | ౧౦ | ౧౦ |
| చెన్నపురి | ౧౫ | ౨౪ | ౩౦ | ౩౩ | ౬ | ౦ | ౩ |
| కుంభకోణం | ౨౩ | ౩౮ | ౪౮ | ౫౧ | ౯ | ౨ | ౫ |
| విజయనగరం | ౧౬ | ౧౭ | ౨౦ | ౨౨ | ౧౪ | ౧౨ | ౧౦ |
| బరంపురం | ౩౦ | ౩౪ | ౩౭ | ౪౦ | ౨౬ | ౨౨ | ౨౦ |
| రంగూను | ౧౪౫ | ౧౪౫ | ౧౪౪ | ౧౪౪ | ౧౪౫ | ౧౪౬ | ౧౪౬ |

### రాజమండ్రినుండి స్వగ్రామమునకు మార్పుట

రాజమండ్రినుండి ఆయాపట్టణములకు మేషాదిసాయనమానము లందుగలుగు దేశాంతరవిఘటికలు పైచక్రమునందు గలవు. ఆయా రాశ్యుదయప్రవేశము మొదలు ఆయా రాశిసాయనమానము లగు చుండును. పై దేశాంతరవిఘటికలు సాయనమానారంభమునందగును. స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్టసాయనమాన మందగు దేశాంతర విఘటికలను పంచాంగతిథ్యాదులందు వల్లని శేషము పైనున్న వాటిని తీసివేయవలెను. క్రిందనున్న వాటిని కలుప వలయును. అట్లు చేయగా స్వగ్రామములకు తిథ్యాదు లగుచున్నవి.

### మేషాది నిరయనరాశి ప్రమాణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | ౪-౨౨ | గం. 1-45 | తుల | ౫-౨౪ | గం. 2-10 |
| వృషభము | ౫- ౧ | గం. 2- 0 | వృశ్చికము | ౫-౩౫ | గం. 2-14 |
| మిథునము | ౫-౩౧ | గం. 2-12 | ధనుస్సు | ౫-౧౭ | గం. 2- 7 |
| కర్కాటకం | ౫-౩౧ | గం. 2-18 | మకరము | ౪-౩౯ | గం. 1-52 |
| సింహము | ౫-౧౮ | గం. 2- 7 | కుంభము | ౪- ౭ | గం. 1-39 |
| కన్య | ౫-౧౩ | గం. 2- 5 | మీనము | ౪- ౧ | గం. 1-36 |

### మేషాది సాయనరాశి ప్రమాణములు

(నిరక్ష దేశమునకు)

| | | | |
|---|---|---|---|
| మీన మేషములు | ౪-౩౯ | కర్కాటక ధనుస్సులు | ౫-౨౨ |
| వృషభ కుంభములు | ౪-౫౯ | సింహ వృశ్చికములు | ౪-౫౯ |
| మిథున మకరములు | ౫-౨౨ | కన్యా తులలు | ౪-౩౯ |

ఇవి దేశలగ్నాయనమున కావలసినవి.

ఆయనాంశములు భా ౨౩ లి ౧౬ విలి ౩౩.౬

ఆయనాంశ గతి విలిప్తలు ౫౦. ౨౬

## సంవత్సర ఫలము

మి వృ మే మీ    మి వృ మే మీ

| | | | |
|---|---|---|---|
| | | శ | ర చం బు |
| ల | జగల్లగ్నము | | |
| | | | కు శు |
| | గు రా | | కే |

| | | | |
|---|---|---|---|
| | | ర బు శ | |
| | నిరయనసౌర వర్షలగ్నము | | చం కు |
| | | | శు |
| | గు రా | ల | కే |

జగల్లగ్నాధిపతికి భాగ్యస్థితి. రాజ్యమునకు భాగ్యాధిపదృష్టి. పంచమరాజ్యాధిపతియు, వాహనలాభాధిపతియు నగు కుజశుక్రులు లగ్నమును చూచుట. అష్టమాధిపతికి వక్రస్థితి, ఆరూఢభాగ్యరాజ్యాధిపతులకు పంచమమున కలయిక ఇవి మంచియోగములు. వర్షలగ్నాధిపతికి విక్రమస్థాన స్థితిచే ఆరూఢ లాభస్థితి. వాహనమందు చంద్రశుక్ర సంబంధము ఇత్యాది సుయోగములు రెండు లగ్నములందును గలవు. కావున దేశమందు సుభిక్షము బాగుగ నుండును. సర్వసస్యములును అభివృద్ధి చెందును. అందు జగల్లగ్నమునకు శుక్రకుజసంబంధ ముండుటచే పరిపాలనము, తీవ్రముగను రాజనీతియు క్రమముగను లాభప్రదముగను నుండి ఆర్థికముగ దేశాభివృద్ధి గల్గును. కాని వర్షలగ్నమును బట్టి ధర్మస్థానమునకు కుజదృష్టి, ధర్మాధిపతికి శనిదృష్టి, జగల్లగ్న ధర్మాధిపతికి రాహుసంబంధము, ధర్మమునకు తృతీయ వ్యయాధిపతియగు బుధుని సంబంధము, ఇత్యాది అవయోగములచే దేశమునందు ధార్మికముగ హాని గల్గినను ఆర్థికముగ కొంత యభివృద్ధి గలుగవచ్చును. మేషసంక్రమణానంతర రాహుప్రవేశకాలలగ్నము మేషమైనది. వర్షలగ్నము వృశ్చికమైనది. రెండు లగ్నములకును కుజుడే అధిపతి. అట్టి కుజుడు దుఃస్థానగతుడు కాడు. కావున వస్త్రములు, కంబళ్లు, బంగారము, బెల్లము, లోహములు, పాదుల కూరలును కొంచెము సులభముగ నుండును. వర్షలగ్నరాజ్యాధిపతికి అష్టమాధిపత్యసంబంధము కేతుసంబంధము గలిగి వక్రస్థితి గలుగుటచే ఉత్పన్నమైనను రాజకీయకలహములు రేకెత్తుచుండును. అట్లు జగల్లగ్నమునకును రాజ్యకేతువు, వక్రాధిపతికి రాజ్యదృష్టి, లగ్నాధిపతికి తృతీయ వ్యయాధిపసంబంధము రాజకీయవిగ్రహములను గలుగచేయుచుండును. ఈ సంవత్సరమున వర్షకాల ప్రారంభమున అనావృష్టి యోగములు బహుళముగ నుండుటచే ఆషాఢ శ్రావణములలో కొన్ని తావులందు వర్షములు తక్కువయై సస్యవృద్ధికి హానిగలుగును. నిజశ్రావణమునుండియు మంచి వర్షములు దేశమంతటను గలుగును. గోదావర్యాది నదులు బాగుగ ప్రవహించును. సస్యాభివృద్ధి గలుగును. వర్షములును ధరలును చేరుగ విమర్శించి వ్రాయబడినవి. సమురాయము మీద ధర్మవృద్ధి రొట్టున్నను ప్రపంచకము ఆర్థికాభివృద్ధితో గూడి యుండవచ్చును.

సర్వేషాం మమ సర్వ శుభాని భవన్తు. శ్రీ: శ్రీ: శ్రీ:

### సూర్యగ్రహణము

(ది 19 ఏప్రిల్ 1958 సం.) 29 చైత్రం 1880.

విలంబ నామ సం॥ చైత్ర బ అమా శ. సూర్యగ్రహణం. కేతు గ్రస్తము. కృష్ణవర్ణము. అర్ధాధిక 3/8 గ్రాసం. సూర్యోదయాది

స్పర్శ కాలః ౧-౬ ఉ. గం 6-16
మధ్యకాలః ౪-౦ ఉ. గం 7-22
శుద్ధమోక్ష కాలః ౭-౨౩ గం 8-44
ఆద్యంత పుణ్యకాలః ౬-౧౮ గం 2-31



దక్షిణగోలః అపసవ్యగ్రహణం. నైరృతిదిక్స్పర్శః ప్రాగీశాన్యమధ్యే ప్రాచ్యాం మోక్షః.

నిత్యభోజన ప్రత్యాబ్దికాది నిర్ణయము :— నిత్యభోజనము, ప్రతిపత్ప్రయుక్త ప్రత్యాబ్దికమున్ను శుద్ధమోక్షానంతరమే చేయవలయును.

## ముఖ్యపట్టణములకు స్పర్శమోక్ష కాలములు

(ఇండియన్ స్టాండర్డు టైము)

హైదరాబాదు స్పర్శ 6-17 మోక్షం 8-40
మదరాసు ,, 6-9 ,, 8-38

## చంద్రగ్రహణము

(తా 24 మార్చి 1959) తా 3 చైత్రం 1881 శకం.

విలంబ సం॥ ఫాల్గుణ శు పూర్ణిమా మం చంద్రగ్రహణం రాహుగ్రస్తం ధూమ్రవర్ణం పాద 1/4 గ్రాసం సింహలగ్నప్రాది

స్పర్శ కాలః ౧౬-౬ గం 24-39
మధ్య కాలః ౧౮-౨౪ రా గం 1-36
శుద్ధమోక్ష కాలః ౨౦-౪౮ రా గం 2-32
ఆద్యంత పుణ్యకాలః ౪-౪౨ గం 1-52



దక్షిణగోలః, సవ్యగ్రహణం. ఈశాన్యదిక్స్పర్శః ఉత్తరదిఙ్మోక్షః.

నిత్యభోజన ప్రత్యాబ్దికాదికము :— ఈ గ్రహణము రాత్రి మూడవయామమున సంభవించుటచే పగటిభోజనమునందును ప్రత్యాబ్దికమునందును సందేహము లేదు.

## వరలక్ష్మీ వ్రతము

శ్రావణ శు అష్టమీ శుక్రవారం వరలక్ష్మీవ్రతము.
శు పూర్ణిమా శు ౧౩-౫౩

ఈ వరలక్ష్మీవ్రతము శుక్లపక్షములో వచ్చెడి శుక్రవారమున సాయంకాలము చేయదగినది. పూర్ణిమా శుక్రవారమున పూర్ణిమ కర్మకాలమగు సాయంకాలమునకు లేదు. "సాయం చారుమతీ ముఖ్యాః పూజాం చక్రు స్స్వలంకృతాః॥" "నభోమాసే పూర్ణిమయా ప్రాక్ క్రాంతే భృగౌ దినే॥" అనియు వరలక్ష్మీవ్రతకల్పమునందు గలదు. కావున అష్టమీ శుక్రవారమే వ్రత మాచరింపదగినది.

## ఉపాకర్మ

శ్రావణ శు త్రయోదశీ బు ౯-౪౫ శ్రవ ౪౩-౩౦ బహ్వృచోపాకర్మ

శు చతుర్దశీ గు ౧౦-౫౯

శు పూర్ణిమా శు ౧౩-౫౩ సర్వయజుషాముపాకర్మ.

ఋగ్వేదులకు శ్రవణనక్షత్రమున ఉపాకర్మ గావున త్రయోదశీనాడు బహ్వృచోపాకర్మ వ్రాయబడినది. కృష్ణయజుర్వేదులకు పూర్ణిమ ప్రాతఃకాలమున నున్న నాడు ఉపాకర్మ యగును గావున పూర్ణిమా శుక్రవారముననే తైత్తిరీయుల కుపాకర్మయగును. వాజసనేయులకు (శుక్లయజుర్వేదులకు) మధ్యాహ్నవ్యాప్తిగల పూర్ణిమ విహితము. కాని ఋఙ్మధ్యాహ్నవ్యాప్తి కావలయునని ధర్మసింధువున గలదు. ఇనను రెండవయామమునందు పూర్ణిమ చేరినతో మధ్యాహ్నవ్యాప్తి యగునని, "ద్వితీయప్రహరే చేత్స్యా దుపాకర్మణి పూర్ణిమా। మధ్యాహ్నవ్యాపినీ యా సా గ్రాహ్యా వాజసనేయిభిః॥" అను స్మృతివాక్యము చెప్పుచున్నది గావున శుక్లయజుర్వేదులకును పూర్ణిమనాడే యుపాకర్మ చేయదగియున్నది.

## శ్రవణద్వాదశి, విష్ణుశ్శృంఖల యోగము

భాద్రపద శు ఏకా మం ౩౬-౧౬ శ్రవ ౫౮-౨ విష్ణుశ్శృంఖల యోగము.

"రాత్రేః ప్రథమప్రహరపర్యంతం తిథ్యా శ్రవణ యోగో గ్రాహ్యః." అని ధర్మసింధువునందు రాత్రి ప్రథమయామమందైనను ద్వాదశీశ్రవణయోగము గలిగి శ్రవణము ఏకాదశితో గలసియున్నతో శ్రవణద్వాదశీఫలము గూడ గలుగజేయు విష్ణుశ్శృంఖలయోగము. అట్టి విష్ణుశ్శృంఖలయోగ మున్నతో శ్రవణద్వాదశ్యుపవాసమున్ను సిద్ధించునని శాస్త్రము.

## శారద నవరాత్ర ప్రారంభము

ఆశ్వ శు ప్రతి సో ౪౧-౪౦ చిత్ర ౩౪-౮ వైధృ ౨౨-౩౫

ప్రతిపత్తునాడు చిత్రానక్షత్రము వైధృతియోగము గలిగినచో ప్రాతఃకాలమున ప్రథమయామమును విడచి తర్వాతనే కలశస్థాపన చేయవలయునని శాస్త్రము.

## సరస్వత్యుద్వాసనం

ఆశ్వ శు అష్టమీ సో ౪-౬ ఉషా ౯-౧౪

శ్రవణ ప్రథమపాదము రాత్రి ప్రథమయామమందు గలిగినను ఆనాడే సరస్వత్యుద్వాసనము చేయవలయు నని శాస్త్రము.

## దుర్గాదేవ్యుద్వాసనము

ఆశ్వ శు నవమీ మం ౫-౨౮ శ్రవణం ౧౨-౧౫

శేషనవమినాడు దశమీ శ్రవణయోగము మధ్యాహ్నకాలమునకు గలిగినను ఆనాడు దుర్గాదేవ్యుద్వాసనము చేయదగినది.

## మహోదయము

పౌష బ అమా శ ౪౫-౪౮ శ్రవ ౩౮-౧౬ వ్యతీ ౩౧-౫౦

అమావాస్య, శ్రవణము, వ్యతీపాత, ఈమూడును ఆదివారమున గలసిన అర్ధోదయము. కొంచెము తక్కువయగుచో మహోదయము. ప్రస్తుతము ఆదివారము గాక శనివారమైనది గావున మహోదయపర్వమగును. ఒక వాక్యమునందు సోమవారముగాని బుధవారముగాని కావలయునని గలదు. బహుదేశములందు ఏవారము అయినను మహోదయ మనుట ఆచరణ ప్రచారములలో నున్నది.

## (శ్రీ) విలంబనామ సంవత్సర పంచాంగ పీఠికా

అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే। సమస్తజగదాధారమూర్తయే బ్రహ్మణే నమః ॥౧॥ లంబోదరం త్రీంద్యయమంబుజ శ్రీ సరస్వత్యౌ రత్నదౌ మర్త్యయామః। యదర్చయా బ్రహ్మముఖామరేశా నిరంతరాయం సఫలీకృతార్థాః ॥౨॥ ప్రాక్పృష్ఠరమ్యఘనిశా భుజంగశయ్యాభిధీయా విహగోత్తువాహా। గోపాల మృత్యుంజయదేవదేవా భజే శ్రియాదత్తవ్యార్ధదేహా ॥౩॥ వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్యద్బిందుమయీం। మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం ॥౪॥

గురుస్తుతిః॥ శ్రీ సోరివంశాబ్ధిసోమం సూర్యనారాయణాభిధం। శ్రోత్రియశ్రేష్ఠం కులగురుం ధ్యాయామి మనసానిశం ॥౫॥ యదను

గ్రహాతః ప్రాప్తం విజ్ఞానం సర్వశాస్త్రజం। తం సాహిత్యగురుం వందే దర్శనైరాగిశాస్త్రిణం ॥౬॥ చిలుకూరి ఖ్యాతవంశమణిం కొండయ్యశాస్త్రిణం। శబ్దశాస్త్రే సునిష్ణాతం వందే మద్వ్యాకరణదేశికం ॥౭॥ మాతులం న్యాయసాహిత్యపారగం మహాన్యాయదేశికం। భజామ్యహం వారణాసి వేంకటేశ్వరశాస్త్రిణం ॥౮॥ యస్య బోధ లవం ప్రాప్య మీమాంసాశాస్త్రసాగరః। తీర్ణో మయా గురుం వందే భూమానందయతీశ్వరం ॥౯॥ మహామహోపాధ్యాయం శ్రీ రఘూపాఖ్య మురళీధరం। తం నమామ్యస్మద్గురుం జ్యోతిషాబ్ధిపారంగతో యతః ॥౧౦॥

స్వీయ వంశక్రమః॥ శ్రీ కౌండిన్య సగోత్రే పిడపర్త్యాఖ్యాన్వయే ప్రసిద్ధతమే। త్రిస్కంధశాస్త్ర కృతినో భవన్తి కవ్యదృశో బహుకాలాత్ ॥౧౧॥ వలమాఖ్య వేంకటాచలాహ్వాఖ్యస్తత్ర శాధవద్బుధః। యో లుప్తమానవిమయకవాదే నాగణయద్ది చ విశ్వపతిం ॥౧౨॥ తస్య సుత స్తత్సదృశో శ్రీసాచల దైవవిత్ప్రవరః। జజ్ఞే తస్య సుతో పూర్ణా విద్యాసుపరిపూర్ణో ॥౧౩॥ తయోర్ద్వితీయోఽ ద్వితీయప్రతిభావాన్ సుబ్రహ్మణ్యో తమః। శ్రీ పూర్ణార్యః పుష్కరాది సంపత్ప్రాప్తిప్రోజ్జ్వలద్యశాః ॥౧౪॥ తదనుగ్రహాత్త విద్యాః పంచసుతాస్తస్య శంభువక్త్రసమాః। శ్రీ కృష్ణమూర్తిశాస్త్రీత్యాఖ్యస్తృతీయో మే సహ మయా ॥౧౫॥ గురువరకరుణావశతస్సిద్ధాన్తి కృత్య నిఖిల సంపత్సు। స్వమతం, తథాద్య క్రియతే పంచాంగం ధర్మకర్మార్థం ॥౧౬॥

## సంవత్సరాది కృత్యం

అష్టాదశ మిత్రసంయుక్తో మంగళస్నాన పూర్వకం। అలంకృతో గణాధ్యక్షం వాణీం దైవవిదం గ్రహాన్ ॥౧౭॥ గురూన్విప్రాంశ్చ సంపూజ్య ముదితో బ్రహ్మ జన్మతః। సంవత్సర ఫలం శ్రుత్వా సుకృతాం ఫలంలభేత్ ॥౧౮॥ యద్వర్షాదౌ నింబకుసుమం శర్కరామ్లఘృతైర్యుతం। భక్షితం పూర్వయామే స్యాత్తద్వర్షం సౌఖ్యదాయకం ॥౧౯॥

## బ్రహ్మణః ప్రమాణాదికం

బ్రహ్మణ సృష్టికాలప్రమాణం సౌరమానేన మా ౫ ది ౨౪ ఘ ౪౬ వి ఘ ౪౦. లవకాల ప్ర. సం ౪౯ మా ౪ ది ౧౪ ఘ ౪౬ విఘ ౪౦. నిమేషకాల ప్ర. సం. ౧౪౮౧ మా ౫ ది ౨౩ ఘ ౨౦ గుర్వక్షరోచ్చారణకాల ప్ర. సం. ౪౦,౦౦౦ ప్రాణకాల ప్ర॥ సం ౪ లక్షః. విఘటీ ప్ర. సం. ౨౪ ల. ఘటీ ప్ర. సం. ౧౪౪౦ల. దిన ప్ర. సం. ౪౩౨ కోటయః. బ్రహ్మణ స్స్వమానే నాయుర్వర్షశతమేవ॥ అనేన బ్రహ్మణః ప్రమాణసౌరాబ్దాః ౩,౧౧,౦౪,౦౦౦ కోటయః. వర్తమానస్యాస్య బ్రహ్మణః పరాఖ్యస్యాయుషార్ధం గతం. ద్వితీయ పరార్ధే ప్రథమవర్షే ప్రథమమాసే గతఘట్యాదయః ఘ ౧౩ విఘ ౪౨ ప్రాణ (౦) గుర్వ ౩ నిమే ౧౯ లవ ౧౮ త్రుటయః ౪౪. సంప్రతి పంచచత్వారింశత్తమే త్రుటికాలే గతసౌరమానాదయః మా ౨ దిన ౨౪ ఘ ౨౬ విఘ ౪౦ బ్రహ్మణ స్సౌరమానేన వయోగతవత్సరాః ౧౫౫౫౨౧౯౭ కో ౨౯ ల ౪౯ సహ ౫౮ సం. ఇదానీం తన శ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాష్షణ్మనవోగతాః। సప్తమే వైవస్వతమన్వంతరే సప్తవింశతి(౨౭) మహాయుగాని గతాని. సప్తర్షింద్రమనూనా మపి స్వమానే నాయుర్వర్షశతమేవ। తత్ప్రమాణ సౌరాబ్దాః ౩౦ కో ౬౭ ల ౨౦ తత్సంవత్సర ప్ర॥ ౩౦ ల ౬౭ సహ ౨౦౦ సం॥ అహోరాత్ర ప్ర॥ ౯౫౨౦ సం॥ అహః ప్ర॥సం॥ ౪౭౬౦ ఘటీ ప్ర. సం. ౧౪౨ సహ ప్రాణి వర్తమానస్యాస్య వయోగతవత్సరాః ౧౨ కో ౫ ల ౩౩ సహ. ౫౯ సం॥ విష్యద్వర్షాః ౧౭ కో ౬౧ ల ౯౬ సహ ౯౪౧ సం. శ్రీ మజ్జగద్గురు శ్రీ మచ్ఛంకరభగవత్పాద పూజ్యవరాబ్దాః ౨౦౩౦ శ్రీ శాలివాహన శకాబ్దాః ౧౮౮౦ ప్రభవాది గతాబ్దాః ౩౧ విష్యదబ్దాః ౨౯.

## వ్యవహారమాన నిరూపణం

అథాస్మిన్దేశే లోకవ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః। వింధ్యస్యోత్తరదేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః। అయమేవ సర్వత్ర ఫలప్రదర్శనార్థం మానసామ్నా గ్రాహ్యః। చాంద్రమానవశాదయం విలంబనామసంవత్సరః। బార్హస్పత్యమానవశా దయం విరోధకృన్నామ సంవత్సరః। అయమేవ వైశాఖాబ్దః। ప్రభవాది షష్టిసంవత్సరేషు ద్వాదశోయుగాని, తత్ర పితృదేవతాకం సప్తమ యుగం వర్తమానం, తత్ర చ సూర్యదేవతాక పరివత్సరనామ వత్సరః। అస్మిన్నన్నదానం మహాఫలం. సంవత్సర ఫలం ప్రముఖే ద్వితీయే॥ కించ—మందం సస్యం న బహు సలిలం వత్సరే తో ద్వితీయే॥ఇతి॥ బార్హస్పత్యమానేన విరోధకృన్నామ సంవత్సర ఫలం॥ చిత్రం జలం తత్ర చ సస్యసంపత్॥ ఇతి.

తా॥ ఈ దేశమున చాంద్రమానాబ్దముచే విలంబసంవత్సరము. దీనికి పరివత్సరమనియు పేరు. ఇందు యవదానము మహాఫలము. ఈ సంవత్సరమున సస్యము మందముగాను, వర్షములు తక్కువగాను ఉండునని శాస్త్రము. బార్హస్పత్యమానముచే విరోధకృత్సంవత్సరము. చిత్రవృష్టిగ వర్షించును. అచటచట సస్యములు బాగుగ నుండును.

## విలంబసంవత్సర ఫలము

విలంబవత్సరే భూపాః పరస్పర విరోధినః।
ప్రజాపీడా త్వర్ఘార్ఘత్వం తథాపి సుఖినో జనాః॥

తా॥ విలంబసంవత్సరమున ప్రభువులు పరస్పరము విరోధము కలిగియుందురు. ధరలు హెచ్చును. ప్రజలు పీడ నందెదరు. ఐనను సుఖించెదరు.

బార్హస్పత్యమానాబ్ద ఫలం—విరోధకృద్వత్సరే తు పరస్పర విరోధినః। సర్వే జనా నృపాశ్చైవ మధ్యసస్యార్ఘవృష్టయః॥ వైశాఖాబ్దఫలం—వైశాఖే ధర్మరతా విగతభయాః ప్రముదితాః ప్రజాస్స నృపాః। యజ్ఞక్రియాప్రవృత్తి ర్నిష్పత్తి స్సర్వసస్యానాం॥

తా॥ బార్హస్పత్యమానముచే విరోధికృత్సంవత్సరము గావున ప్రజలు, ప్రభువులు పరస్పరవిరోధు లగుదురు. సస్యము, ధరలు, వర్షములు సాధారణముగా నుండును. వైశాఖాబ్ద మగుటచే ప్రజలు, ప్రభువులు, భయములేనివారై సంతోషచిత్తులై ధర్మనిరతులై యాగములను చేయుచుందురు. సర్వసస్యములు ఫలించును.

## రాజాది నిర్ణయము

| | | |
|---|---|---|
| రాజా శుక్రః | గణకో గురుః | నరాధిపతి శ్శనిః |
| మంత్రీ సూర్యః | గ్రామపాలకో రవిః | గ్రామనాయకః కుజః |
| సేనాధిపతి శ్శనిః | దైవజ్ఞ శ్శనిః | వస్త్రాధిపతి శ్శుక్రః |
| సస్యాధిపతి ర్బుధః | రాష్ట్రాధిపతి శ్శుక్రః | రత్నాధిపో రవిః |
| ధాన్యాధిపతిశ్చంద్రః | సర్వదేశోద్యోగపతీ రవిః | వృక్షాధిప శ్చంద్రః |
| అర్ఘాధిపో రవిః | అశ్వాధిపో రవిః | జంగమాధిపో బుధః |
| మేఘాధిపో రవిః | గజాధిపో బుధః | సర్పాధిపతి ర్గురుః |
| రసాధిపతి శ్శుక్రః | పశూనా మధిపో రవిః | మృగాధిపతి శ్శనిః |
| నీరసాధిపతి ర్బుధః | దేవార్చకో బుధః | శుభాధిపతి శ్శుక్రః |
| పురోహితో బుధః | | స్త్రీణా మధిపో రవిః |
| పరీక్షక కుజః | | |

రవిః—మంత్రి, అర్ఘాధిపతి, మేఘాధిపతి, గ్రామపాలకుడు, సర్వదేశోద్యోగపతి, అశ్వాధిపతి, పశువులకు అధిపతి, రత్నాధిపతి, స్త్రీల కధిపతియు నయ్యెను.

చంద్రుడు:—ధాన్యాధిపతి, వృక్షాధిపతియు నయ్యెను.
కుజుడు:—పరీక్షకుడు గ్రామనాయకుడు నయ్యెను.
బుధుడు:—సస్యాధిపతి, నీరసాధిపతి, పురోహితుడు, గజాధిపతి, జీవార్థీశుడు, జంగమాధిపతియు నయ్యెను.
గురుడు:—గణకుడు, సర్వాధిపతియు నయ్యెను.
శుక్రుడు:—రాజు, రసాధిపతి, రాష్ట్రాధిపతి, వస్త్రాధిపతి, శుభాధిపతియు నయ్యెను.
శని:—సేనాధిపతి, దైవజ్ఞుడు, నరాధిపతి, మృగాధిపతియు నయ్యెను.

## రాజు శుక్రుడు - ఫలము

సమృద్ధసస్యా వసుధా తివృష్టి
ర్గావో హి సంపూర్ణపయః ప్రదాః స్యుః।
ప్రియాః ప్రియాణాం జనయంతి తోషం
కౌశిూపచారై ర్భృగుజే బ్దనాథే॥

తా॥ సస్యసమృద్ధి, అతివృష్టి కలిగియుండును. గోవులు పుష్కలముగ క్షీరముల నొసంగును. దంపతు లన్యోన్యముగ సంతోష చిత్తులై యుందురు.

## మంత్రి రవి - ఫలము

రాజ్ఞా మన్యోన్యవైరిత్వ మనావృష్టి శ్చ సంగరః।
అధర్మనిరతా మర్త్యా మంత్రిత్వే భాస్కరస్య చ॥

తా॥ ప్రభువులకు పరస్పర విరోధము, అనావృష్టి, యుద్ధ భయము, జనుల కధర్మమం దాసక్తియు కలుగును.

## సేనాధిపతి శని - ఫలము

సేనాధిపే సూర్యసుతే ధరిత్ర్యాం
సేనావియుక్తా స్సతతం నరేంద్రాః।
అధర్మయుక్తా స్సతతం ప్రజాశ్చ
కృష్ణాని ధాన్యాని ఫలంతి భూమౌ॥

తా॥ ప్రభుత్వమునకు సేవలకు అంతఃకలహములు లేచును. ప్రజ లధర్మనిరతు లగుదురు. నువ్వులు, మినుములు మొదలగు నల్ల ధాన్యములు ఫలించును.

## సస్యాధిపతి బుధుడు - ఫలము

మధ్యవృష్టి ర్మందసస్యం మేఘా వాతేన పీడి.
త్రసంతి మనుజా నిత్యం బుధే సస్యాధిపే సతి॥

తా॥ సాధారణవృష్టి, సాధారణ సస్యవృద్ధి గలుగును. మేఘములు వాయుపీడితము లగును. ప్రజలు నిత్యము భయపడుచుందురు.

## ధాన్యాధిపతి చంద్రుడు - ఫలము

బహుక్షీరప్రదా గావః సర్వే వ్యాధివివర్జితాః।
సుభిక్షంచ మహద్వర్షం చంద్రే ధాన్యాధిపే సతి॥

తా॥ గోవులు క్షీరసమృద్ధి గలవి యగును. అందరును వ్యాధి విముక్తు లగుదురు. సుభిక్షము, మంచివర్షములు కలుగును.

## అర్ఘాధిపతి రవి - ఫలము

అనర్ఘ శ్చాల్పవృష్టి శ్చ ప్రజానాం క్షుద్భయం తథా।
రాజ్ఞాం పరస్పరక్రోధ స్సూర్యేఽర్ఘాధిపతౌ సతి॥

తా॥ అధికముగు ధరలు, అల్పవృష్టి, దుర్భిక్షము, ప్రభువులకు పరస్పర విరోధము కలుగును.

## మేఘాధిపతి రవి - ఫలము

మహద్భయం ఫలం స్వల్పం వర్షం పార్థివాః క్షితౌ।
రక్తసస్యం సుఫలితం సూర్యే మేఘాధిపే సతి॥

తా॥ అధికమైన భయము, స్వల్పముగు పంట, ఖండవృష్టి కలుగును. కందులు మొదలగు ఎర్రధాన్యములు బాగుగా ఫలించును.

## రసాధిపతి శుక్రుడు - ఫలము

తిలతైలగుడాః క్షౌద్రం పయాంసి దధిశర్కరాః।
అర్ఘవృద్ధ్యై ప్రజాయంతే శుక్రో యది రసాధిపః॥

తా॥ నువ్వులు నూనె, బెల్లము, తేనె, పాలు, పెరుగు, పంచదార మొ॥ రసవస్తువులు సమృద్ధిగా లభించును.

## నీరసాధిపతి బుధుడు - ఫలము

గారుత్మతాదిరత్నాని ధాన్యాని వివిధాని చ।
సర్వాణి వృద్ధి మాయాంతి బుధే నీరసనాయకే॥

తా॥ ఇంద్ర నీలము మొదలగు రత్నములు, వివిధములైన ధాన్యములు, అధికముగా లభించును.

## పురోహితాద్యధిపతి - ఫలము

క్రూరగ్రహాఫలం క్రూరం శుభగ్రహాఫలం శుభం।
పురోహితాదిసర్వేషాం భవే ద్దీతిసముద్భవం॥

తా॥ తక్కిన పురోహితాద్యధిపతులు క్రూరగ్రహము లగుచో చెడ్డఫలము. శుభగ్రహములగుచో మంచిఫలము. (రవి కుజ శనులు, పాపయుత బుధుడు, క్షీణచంద్రుడును క్రూరులు).

## మేఘాదినిర్ణయము—ఫలము

ఆవర్తమను మేఘము—మధ్యవృష్టి। ఉత్తరదిక్కున మేఘోత్పత్తి। చతుర్మేఘపక్షమున ద్రోణమను మేఘము—కూర్పువానలు। ఆవహమను వాయువు—అనుకూలవర్షములు। చపలాయను మెఱుపు—వాయుపీడ। నైరాశిమను ఉరుము—మధ్యవృష్టి। ఘృత సముద్రము—సుభిక్షము। తక్షకుడను శేషుడు భూమిని వహించును—ప్రభువులు ధనహీను లగుదురు. మ్లేచ్ఛులు సుఖమునందెదరు.

## సావన వర్షారంభము

(తి 3-6-1958) జ్యేష్ఠ బ ౧ మంగళవారము. వర్షాధిపతి కుజుడు.

అగ్నితస్కరరోగాస్స్యుః నృపా విగ్రహతత్పరాః।
హతిసస్యం వ్యాళభయం భౌమాబ్దే వృష్టినాశనం॥

తా॥ అగ్ని, చోరులు, రోగములు పీటెవలనను సర్పములవలనను భయము. ప్రభువులు యుద్ధాసక్తు లగుదురు. సస్యములకు హాని కలుగును.

## పశుపాలకాది నిర్ణయము - ఫలము

ఈ సంవత్సరము పశుపాలకుడు, గోష్ఠాగారప్రాపకుడు శ్రీ కృష్ణుడు. గోష్ఠబహిష్కారకారకుడు యముడు. శ్రీ కృష్ణాధిపత్యముచే గోవులు క్షీరవృద్ధియు, ఆరోగ్యము కలిగియుండును. యమాధిపత్యముచె అధిక మగు ధరలు, అల్పవృష్టి గోవులకు స్వల్ప క్షీరము, వ్యాధులున్ను, సంభవించును.

## వర్ష పరిమాణము

నాలుగు ఆఢక (కుంచ)ములు వర్షము— మధ్యవృష్టి। "అష్ట భాగా స్సముద్రేషు పర్వతేషు తథా నవ। త్రిభాగా భువి పర్జన్య శ్చైవం వర్షతి చ త్రిధా॥" సముద్రమునం దెనిమిది భాగములును, పర్వతములందు తొమ్మిదిభాగములును, భూమియందు మూడుభాగములును వర్షించును.

ఆఢక ప్రమాణము—"షష్టియోజన విస్తీర్ణం శతయోజన మున్నతం। ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే॥"

ఆఢకస్థితి:—వత్సరాది ప్ర॥ జ్యేష్ఠ బ ౧ పో ప॥ బ్రాహ్మణ బాలుని హస్తమందును, అటనుండి ఆశ్వయుజ బ ౧౧ శుక్రప॥ గోప వృద్ధునిహస్తమందును, అటనుండి పౌష బ ౧౨ బుధ.ప॥ బ్రాహ్మణ

బాలుని హస్తమందును, అటనుండి సంవత్సరాంతమువరకు బ్రాహ్మణ యువకుని హస్తమందును అధిక ముండును. గోపహస్తమం దుండిన ప్రుడు సుభిక్షము, ఆరోగ్యము, సంపత్తి కలుగును. బ్రాహ్మణ హస్త మందుండునప్పుడు దుర్భిక్షము, సస్యనాశనము కలుగును. బాల్యవయస్సుచే వర్షములు తక్కువ యగును. యౌవనవయస్సుచే సువృష్టి, వార్ధకవయస్సుచే సుభిక్షము కలుగును.

## వర్ష ధాన్యాది ప్రమాణములు (వింశోపకములు)

వర్షం ౧౫ ధాన్యం ౧౯ శీతం ౧౧ తృణ ౧౯ ఉష్ణం ౧౩ మారుతః ౪ ప్రజావృ ౧౫ నా ౧౫ రాజవిద్వరం ౧౧ వ్యాధయః ౫ ఉపశమనం ౯ ఆచారః ౨౧ అనాచారః ౧౧ మరణాని ౧౧ జన్మాని ౯ దేశోపప్లవః ౪ దేశస్వాస్థ్యం ౧౫ చోరభయం ౧౯ నా ౨౧ అగ్నిభయం ౫ నా ౪ మృగోపద్రవః ౧౩ నా ౪ కీటభయం ౪ నా ౧౫ మూషకవృ ౧౫ నా ౪ సర్పవృ ౯ నా ౫ శలభవృ ౩ నా ౧౧ మశకవృ ౪ నా ౪ మత్కుణవృ ౧౧ నా ౩ వృశ్చికవృ ౧౧ నా ౧౧ వ్యాఘ్రవృ ౩ నా ౪(౧౧) సస్యవృ ౯ నా ౬ శుకవృ ౯ నా ౪ పికవృ ౭ నా ౫ కుక్కుటవృ ౭ నా ౯ ఖగవృ ౨ నా ౮ గోవృ ౮ నా ౨ మహిషవృ ౫ నా ౫ మృగవృ ౨ నా ౨ ఛాగవృ ౮ నా ౮ అశ్వవృ ౫ నా ౮ శ్వేతజవృ ౧౧ నా ౧౯ వ్రీహివృ ౧౯ శాలివృ ౧౨ కులుత్థవృ ౭ తిలవృ ౬ మాషవృ ౧౬ ముద్గవృ ౧౨ సర్షపవృ ౧౦ చణకవృ ౧౬ ఆఢకవృ ౧౦ గోధూమవృ ౧౭ కోద్రవవృ ౧౦ ప్రియంగువృ ౧౬ యావనాళవృ ౧౭ శ్యామాకవృ ౧౨ రాజమాషవృ ౮ నీవారవృ ౧౬ శింబిధాన్యవృ ౧౨(౧౭)

## ర వి చా ర ఫ ల ము

చైత్ర బ దశమి ఆదివారము మేషే రవిః ౮౨|౫౧॥ ఏకాదశి—సుభిక్షము। ఆదివారము—దుర్భిక్షము। ధనిష్ఠ—భూమి సంపూర్ణముగ ఫలించును। శుభయోగము—సౌభాగ్యవృద్ధి। బవకరణము—సౌఖ్యము। సమర్లగ్నము—సుభిక్షము। రాత్రి—వర్షవృద్ధి। పూర్వాషాఢాదినక కము—శుభము.

ఆర్ద్రాప్రవేశము:—ఆషాఢ శు చతుర్థి శనివారము. ఆర్ద్రా ౧ రవిః ౫౧|౨౮॥ పంచమి—శుభము। ఆదివారము—పశుహాని।మఘ—స్వల్పవృష్టి। వజ్రయోగము—అతివృష్టి। బాలవకరణము—సుభిక్షము। మీనలగ్నము—యుద్ధభయము। రాత్రి—సువృష్టి, సస్యాభివృద్ధి। మఘాదిమండలము—మధ్యవృష్టి, మధ్యఫలము కలుగును.

## చ ం ద్ర చా ర ఫ ల ము

జ్యేష్ఠ శు ప్రతిపత్తు సోమవారము—సుభిక్షము, క్షేమము, ఆరోగ్యము, సువృష్టి, సస్యవృద్ధి, ఆనందమున్ను కలుగును. ఆషాఢశుక్ల పంచమి ఆదివారము—అల్పవృష్టి, ఆషాఢ శుక్ల దశమ్యేకాదశుల యందు స్వాతినక్షత్రము—అతివృష్టి, మధ్యవృష్టి। ఆషాఢ కృష్ణపక్షమందు రోహిణీ నక్షత్రము ద్వాదశియందు గాన సర్వసస్యహాని.

మరియు చైత్రమున ౫ శనివారములు, వైశాఖమున ౫ ఆదివారములు, జ్యేష్ఠమాసమున ౫ మంగళవారములు, నిజశ్రావణమాసమున ౫ శనివారములు, భాద్రపదమాసమున ౫ ఆదివారములు, ఆశ్వయుజమాసమున ౫ మంగళవారములు, పౌషమాసమున ౫ శనివారములు, మాఘమాసమున ౫ ఆదివారములు, ఫాల్గునమాసమున ౫ మంగళవారములు వైనవి.

మంగళవారము లైదగుటచే యుద్ధభయము. శనివారము లైదగుటచే జననాశము, దుర్భిక్షము, భూకంపాద్యుపద్రవములు, ఆదివారము లైదగుటచే దుర్భిక్షము కలుగును.

## సౌ రా ర్ఘ ము లు

మేష, మిథున, సింహ, ధను, మకర, కుంభ, మీనమాసముల యందు యావనాళ, యాలకీ, కుంకుమ, హింగు, కాంస్య, తైల, ఏరండ, గోధూమ, కస్తూర్యాదులు శీఘ్రార్ఘము లగును. ధాన్యాజ్య చణక వస్త్ర కర్పూర లవణ తామ్ర కులుత్థ లవంగపుష్ప పీపాదు లత్యర్ఘము లగును. సువర్ణ రజత కార్పాస మాష ముద్గ మరీచ నాగవల్లీ దళ తిల జీర జాజీ పిప్పలి పట్టాది కాయస శ్రీగంధ క్రముక శర్కరాదులు సమార్ఘము లగును. వృషభ, కర్కాట, వృశ్చికమాసములందు—యావనాళాదులు సమార్ఘము లగును, ధాన్యాదులు శీఘ్రార్ఘము లగును, సువర్ణాదు లత్యర్ఘము లగును. కన్యా, తులా మాసములందు—యావనాళాదు లత్యర్ఘము లగును. ధాన్యాదులు సమార్ఘము లగును. సువర్ణాదులు శీఘ్రార్ఘము లగును.

## చాంద్రార్ఘములు

చైత్ర, అధికశ్రావణ, నిజశ్రావణ, కార్తిక మార్గశిరము లందు—యావనాళాదులు శీఘ్రార్ఘము లగును। ధాన్యాదు లత్యర్ఘము లగును। సువర్ణాదులు సమార్ఘము లగును। వైశాఖ, ఆషాఢ, ఆశ్వయుజ, మాఘమాసములందు—యావనాళాదు లత్యర్ఘములగును। ధాన్యాదులు సమార్ఘము లగును। సువర్ణాదులు శీఘ్రార్ఘ లగును। జ్యేష్ఠ, భాద్రపద, పౌష, ఫాల్గునమాసములందు యావనాళాదులు సమార్ఘము లగును। ధాన్యాదులు శీఘ్రార్ఘము లగును। సువర్ణాదు లత్యర్ఘము లగును.

## మౌఢ్య నిర్ణయము

ఆశ్వయుజ శు. తృతీ. బుధ. (తి 15-అక్టోబరు-1958) ప్రభృతి మార్గశిర శు. ద్వితీ శు. (తి 12-డిశంబరు-1958) పర్యంతం శుక్ర మౌఢ్యము. ఆశ్వయుజ శు. అష్ట. సో (తి 20-అక్టోబరు-1958) ప్రభృతి కార్తిక శు సప్త సో (తి 17-నవంబరు-1958) పర్యంతం గురు మౌఢ్యం. మిగిలిన నెలలు మంచివి.

## మకరసంక్రాంతి పురుషలక్షణము

అష్టకర్ణో విశాలాక్షో లంబభ్రూర్దీర్ఘనాసికః। అష్టబాహుః చతుర్వక్త్రః సంక్రాంతిపురుషః స్మృతః॥ త్రింశద్యోజన మానశ్చ విస్తీర్ణం ద్వాదశ స్మృతం। ఏవం రూపంహివిజ్ఞేయం సంక్రాంతి పురుషాకృతేః॥



ఈ సంక్రాంతి పురుషునకు మందు డని పేరు-ప్రభువుల కరిష్టము। కుంభ మోదకము చే స్నానము - స్త్రీల కరిష్టము. శివగల వత్సత లుగ ధరించును-శివ గల నాశనం. చిత్ర వర్ణముగల వస్త్రము ధరించును - శుభము కలుగును. కుంకుమ గంధము - యుద్ధ భయము. వకుళపుష్పము-కీర్తి వృద్ధి. రజతాభరణం రజతనాశనం. రాగి పాత్రయందు పాలు త్రావును - లోహములు పెంద! వాని నాశనం, స్ఫోటకభయం. మామిడిపండు - ప్రజలకు సుఖము. వరాహవాహనము - మహిష నాశనము. పసుపు పచ్చని గొడుగు - ఆ వస్తువుల నాశనం! కీర్తి

ఆయోధనము - స్వల్పయుద్ధం. తెల్లని పద్మమును ధరించును - శుభము కలుగును. ఉత్తరదిక్కునకు ప్రయాణం - ఉత్తరదేశారిష్టము. నిద్ర చేష్ట - ప్రజలకు సుఖం. నిలబడియుండును - ప్రభువులకు శుభము.

పక్షఫలము:—శుక్లపక్షే యదా పౌషే మకరస్థో దివాకరః।
ప్రజానాం వ్యాధిపీడా చ నృపాణాం సమరం భవేత్॥

తా॥ మకరసంక్రాంతి శుక్లపక్షమున వచుటచే ప్రజలకు వ్యాధి పీడయు, ప్రభువులకు యుద్ధమును కలుగును.

తిథ్యాది ఫలము:—పౌష శు పంచమి బుధవారం మకరేరవిః ౧౦-౩ పఞ్చమి—భయము, బుధవారము—శుభము, పూర్వాభాద్ర— క్షామాదుల కరిష్టము. వరీయాన్ యోగము—సువృష్టి, బాలవము— సువృష్టి. మీనలగ్నము—ధర లధికము. పూర్వాహ్ణము—ప్రభువుల కరిష్టము. అరవముహూర్తము-వివిధరోగములు, యుద్ధములు కలుగును.

శ్లో॥ యశ్శృణోతి మధుశుక్లపక్షకే వర్షనాథ సచివాదికం ఫలం। ప్రాప్నుయాద్దురితముక్తవిగ్రహో హ్యాయురర్థ మతులం యశస్సుఖం॥ కాలా మపరాగాదీ నుక్త్వా పుణ్యాని కారయే ద్యస్తు। తేషా మంశం దశమం నియమే నాప్నోతి దైవజ్ఞః॥ ఆయుర్వృద్ధిం పుత్రపౌత్రాభి వృద్ధిం నిత్యారోగ్యం మంగళం నిర్వ్యపాయం। అచ్ఛిన్నా నాముత్సవానా మవాప్తిం యచ్ఛంత్యేతే వత్సరాధీశముఖ్యాః॥

## సస్య విచారము

సర్వసస్యసముదాయము అను 16 పాళ్లలో (వీసములలో) 9 పాళ్లు (వీసములు) పంట ఫలించును. నాయక విచారముచే పూర్వ (గ్రైష్మిక) సస్యములు స్వల్పముగ ఫలించును. సస్యజాతిక విచారముచేతనున్న కొంచెం ఉత్తమమైన వృద్ధి కలిగియుండును. రెండవ పంట (శారద) ధాన్యములు అయినను మధ్యమముగ నుండును.

## ఆదాయ వ్యయములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషవృశ్చికములు | ఆ | ౨ | వ్య | ౮ | సింహము | ఆ | ౧౧ | వ్య | ౫ |
| వృషభతులలు | ఆ | ౧౧ | వ్య | ౧౪ | ధనుర్మీనములు | ఆ | ౫ | వ్య | ౧౪ |
| మిథునకన్యలు | ఆ | ౧౪ | వ్య | ౧౧ | మకరకుంభములు | ఆ | ౮ | వ్య | ౮ |
| కర్కాటకం | ఆ | ౮ | వ్య | ౧౧ | సర్వాదాయ | ౫౭ | సర్వ | వ్య | ౭౧ |

## రాజపూజావమానములు

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషము | రా | ౧ | అ | ౭ | సింహము | రా | ౬ | అ | ౩ | ధనుస్సు | రా | ౪ | అ | ౨ |
| వృషభము | రా | ౪ | అ | ౭ | కన్య | రా | ౨ | అ | ౬ | మకరము | రా | ౭ | అ | ౨ |
| మిథునము | రా | ౭ | అ | ౭ | తుల | రా | ౫ | అ | ౬ | కుంభము | రా | ౩ | అ | ౫ |
| కర్కాటము | రా | ౩ | అ | ౩ | వృశ్చికము | రా | ౧ | అ | ౨ | మీనము | రా | ౬ | అ | ౫ |

## కందాయ ఫలములు

| అశ్వి | భర | కృ | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౪ | ౭ | ౧ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ |

| మఘ | పుభ | ఉభ | హస్త | చిత్ర | స్వా | విశా | అనూ | జ్యే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ |

| మూ | పూషా | ఉషా | శ్రవ | ధని | శత | పూభా | ఉభా | రేవ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ |

ఫలం॥ విషమే వ్యర్థలాభ స్స్యాత్ శూన్యే తు సమతా భవేత్।
శూన్యేషు శూన్యం భవతి కందాయ త్రయయోగతః॥

ఆదిశూన్యే భవే ద్వ్యాధి ర్మధ్యశూన్యే మహద్భయం।
అంత్యశూన్యే భవే ద్ధానిః కందాయఫల మీదృశమ్॥

## సంవత్సర ఫలము

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్విని | పుష్య | స్వాతి | అభిజిత్తు | వారలకు | యుద్ధభయం |
| భరణి | ఆశ్లేష | విశాఖ | శ్రవణం | ,, | అలంకారప్రాప్తి |
| కృత్తిక | మఘ | అనూరాధ | ధనిష్ఠ | ,, | రోగభయం |
| రోహిణి | పుబ | జ్యేష్ఠ | శ. తా | ,, | ఆయుర్వృద్ధి |
| మృగశిర | ఉభ | మూల | పూ. భా | ,, | అర్థలాభము |
| ఆర్ద్ర | హస్త | పూ. షా | ఉ. భా | ,, | మనస్తాపం. |
| పునర్వసు | చిత్త | ఉ. షా | రేవతి | ,, | రాజపూజ్యత |

## కుజచార ఫలము

గతసంవత్సరమున ఉదయించిన నక్షత్రము మొదలు 15, 16 నక్షత్రములలో వక్రము కలుగుటవలన ప్రజానకు రుధిరానన మను పేరు గల వక్రిము. కనుక ఈకాలమున (భాద్రపద బ ౧౨ శు॥ ప్ర॥ మార్గశిర్ష శు॥ దశమి శని వ.) ముఖరోగములును, భయముతోగూడిన సుభిక్షము కలుగును.

## బుధచార ఫలము

అయా మాసములం దుదయాస్తమయముల సంధిన బుధుడు వైశాఖ శు పంచమి గు, ఆషాఢ శు పూర్ణిమ సం, నిజశ్రావణ బ ప్రతిపత్ శు, ఆశ్వయుజ శు పూర్ణిమ సో, మార్గశిర్ష శు పంచమి సో, మాఘ బ అష్టమి సో, ఫాల్గున బ త్రయోదశి ఆ. లం దుదయించుటచే యుద్ధభయము, అగ్నిభయము, చోరభయము, రోగభయము, దుర్భిక్షము, జలభయము గలుగును. మరియు నెపుడైన బుధోదయానంతర మేకోని విపరీతఫలము కలుగును. వర్షమున్నచో నవావృష్టి, అనావృష్టియున్నచో అతివృష్టి, సుభిక్షమున్నచో దుర్భిక్షము, దుర్భిక్షముగ నున్న సుభిక్షము, భయముగ నున్న క్షేమము, క్షేమముగ నున్న భయము, ఇట్లు విపరీతఫలము కలుగును.

## గురుచార ఫలము

వత్సరాది ప్ర॥ వైశాఖ బ చతుర్దశి శని. ప॥ తులయందు గురుడు. అటనుండి అధికశ్రావణ శు పంచ. సో ప॥ కన్యయందు గురుడు (వక్రగతి). అటనుండి మార్గశిర్ష బ ద్వితీయ ఆ॥ ప. తులయందు గురుడు. అటనుండి వత్సరాంతమువరకు వృశ్చికరాశియందు గురుడు. ఫలము:—తులారాశియందు గురుడుండ సువృష్టి, సర్వసస్య సమృద్ధియు గలుగును. కాని తూచదగిన మిర్చి, చింతపండు, బెల్లము, కూరలు వగైరా పదార్థములు దుర్లభము లగును. కన్యయందు గురుడుండ వర్షములును సస్యములును బాగుగ నుండును. ధరలు కొంచెము తగ్గి సుభిక్షముగ నుండును. ప్రభుత్వమున కాదాయ మధికమగును. బ్రాహ్మణులు సత్కర్మల నాచరింతురు. వృశ్చికరాశియందు గురుడుండునపుడు భూమి సస్యవృద్ధి, వృష్టి సమృద్ధి కలిగియుండును. అన్ని వర్ణములవారు సుఖముగ నుందురు. సంకరజాతులకు హాని.

## శుక్రచార ఫలము

ఈ సంవత్సరమున ఆశ్వయుజ శు తృతీయ బుధ॥ హస్తనక్షత్రమందు దక్షిణమార్గమందు అజవీథియందు తూర్పున నస్తమించును. తిరుగ మార్గశిర శు ద్వితీయ శుక్ర॥ పూషానక్షత్రమందు దక్షిణమార్గమందు మృగవీథియందు పడమరదిక్కున నుదయించును. ఫలము॥ దక్షిణమార్గమున నుదయమగుటచే వర్షములు తక్కువయగుటచే ధాన్యములు జాగ్రత్తచేసి మరుసపంట వేయవలెను. అజవీథియం దస్తమించుట సస్యము, వర్షము, బ్రహ్మచారులు, వృద్ధి. మృగవీథియం దుదయించుట మృగములకు, సస్యములకు, తపస్వులకు రోగము. శుక్ల

పశ్చిమున నుదయాస్తమయములగుటచే ఏనుగులు, గుఱ్ఱములు, యుద్ధవీరులు, యుద్ధమునందు హాతులగుట తటస్థించును. మఘాదిపంచకమండలమున అస్తమించుటచే సస్యహాని, దుర్భిక్షము, చోరభయము, నీచుల కభివృద్ధి, సంకరము కలుగును. జ్యేష్ఠాదిమండలమున నుదయించుటచే దుర్భిక్షము, చోరబాధ, రోగములును కలుగును. కాశ్మీర, అశ్మక, మత్స్యశ్రీ, అవంతీ దేశములు, ద్వారకాది నగరములున్ను పీడ నందును.

## శనిచారఫలము

సంవత్సరాది ప్ర॥ జ్యేష్ఠ బ ప్రతిపత్ పో॥ ప॥ ధనస్సునందు, అటనుండి అశ్వయుజ బ ఏకాదశి శు॥ప॥ వృశ్చికమున, అటనుండి వత్సరాంతమువరకు ధనూరాశియందు శని సంచరించును. అందు సంవత్సరాది ప్ర॥ జ్యేష్ఠ బ ప్రతిపత్ పో॥ ప॥ మూలయందును, అది మొదలు అశ్వయుజ బ ఏకాదశి శు॥ప॥ జ్యేష్ఠయందును, అది మొదలు ఫాల్గున శు పూర్ణిమ మం॥ప॥ మూలనక్షత్రమందు, అది మొదలు వత్సరాంతమువరకు పూర్వాషాఢయందును శని సంచరించును. ఫలము— శని వృశ్చిక రాశియందుండుటచే ప్రజలకు రోగభయము, పశువులకు, సైనికులకు, సంఘములకు హాని. ప్రభువులకు భేదము(విరోధభావము) కలుగును. ధనూరాశియం దుండగా, అల్పవృష్టి, ప్రభువులకు కలహము, ధరలు హెచ్చుగుట, పాంచాలము, కోసలము, కురుదేశము, కాశ్మీరము, వంగము, కళింగము, కాశీదేశము, హానినందును. జ్యేష్ఠయందుండగా రాజులు, రాజపురోహితులు, రాజసన్మానితులు, శూరులు, సంఘములు, సైనికులు పీడ నందెదరు. మూలయం దుండగా కొంకణ, పాంచాల, కాశీదేశములు, యుద్ధభటులు, ఓషధులు, ఫలజాతులు నశించును. దుర్భిక్షము, అనావృష్టి, యుద్ధభయము కలుగును. పూర్వాషాఢయం దుండగా అంగ, వంగ, కోసల, గిరివ్రజ, మగధ, పుండ్ర, మైథిల దేశస్థులును, తామ్రలిప్తి నగరవాసులును ఉపద్రవమును పొందెదరు. ఈ మూడునక్షత్రములయందు సంచరించుట మంచిది కాదు.

కూర్మచక్రముచే:— పారావత, బర్బర, అవంతీ, పూర్వమాళవ, సైంధవ, సురాష్ట్ర, పంచనద, త్రిగర్త, లంగ, శకాది పశ్చిమ దేశములకు హాని.

## రాహుచారఫలము

చైత్రమాసగ్రహణముచే శిల్పులు, లేఖకులు, గాయకులు, వేశ్యలు, బంగారు వర్తకులు, పౌండ్ర, ఓఢ్ర, కేకయ, అశ్మక దేశస్థులును పీడనందుదురు. చిత్రవృష్టి. ఫాల్గునమాస గ్రహణముచే వంగ, అశ్మక, అవంతి, మేకలదేశస్థులకు, నాట్యముచేయువారలకు, ఉత్తమ సస్యములకు, ఆయుధములను తయారుచేయువారలకు, క్షత్రియులకు, తపశ్శాలురకు హాని కలుగును.

## దేశారిష్టయోగములు

1. వత్సరాది ప్ర॥ వైశాఖ బ చతుర్దశి శ॥ ప॥ గురువకు తృతీయమున శని. ఫలము. వింధ్యకు దక్షిణమున జనహాని.

2. వత్సరాది ప్ర॥ జ్యేష్ఠ బ ప్రతిపత్ పో॥ ప॥ ధనుస్సునందు శని ఫలము. ప్రభువులకు యుద్ధములు, ప్రజలకు రోగములు, దుర్భిక్షము, శస్త్రభయము గలుగును.

3. చైత్ర బ ద్వితీయా శ॥ ప్ర॥ జ్యేష్ఠ బ ప్రతిపత్ పో. ప॥ మూలయందు శని వక్రము. ఫలము. సైనికులకు హాని.

4. చైత్ర బ ద్వితీయా శ॥ ప్ర॥ నిజశ్రావణ శు దశమీ ఆ॥ ప॥ జ్యేష్ఠామూలలందు శనివక్రము. ఫలము. యవన (కాబోలు వగైరా) దేశాధిపతికిని అవంతిదేశాధిపతికిని 6 మాసములలో హాని యగును.

5. చైత్ర బ తృతీయా ఆ॥ ప్ర॥ వైశాఖ శు ఏకాదశి బు. ప. బుధ గురు శనులకు గ్రహాత్రయమునకును వక్రము. ఫలము॥ యుద్ధములు, అనావృష్టిభయము గలుగును.

6. వైశాఖ బ చతుర్దశి శ॥ ప్ర॥ జ్యేష్ఠ శు అష్టమీ సో॥ ప॥ గురు శుక్ర సమసప్తకము. ఫలము. ప్రజలకు—జలభయమో, అగ్నిభయమో, రోగభయమో, యుద్ధభయమో, సర్పభయమో, చోరభయమో, దుండగులవలని భయమో కలుగును.

7. జ్యేష్ఠ శు దశమీ గు. ప్ర॥ ఆషాఢ బ నవమీ గు. ప॥ మీన కన్యా వృశ్చిక ధనూరాసులందు కుజ గురు శనులకు సంచారము ఫలము. దుర్భిక్షము, ప్రభువులకు యుద్ధములు, మరణభయము, రక్తప్రవాహములును గ్రామవాసులకు అగ్నిభయము, వాయుభయము వ్యాధిభయములును గలుగును.

8. జ్యేష్ఠ బ ప్రతిపత్ పో. ప్ర॥ అధిక శ్రావణ శు పంచమీ పో. ప॥ తిరుగ గురునకు తృతీయమందు శని (ఫలము 1 యో చూ.)

9. జ్యేష్ఠ బ ప్రతిపత్ పో. ప్ర॥ భాద్రపద శు ద్వాదశి బు ప॥ శనికి వ్యయస్థానమందు రాహువు ఫలము. ఆంధ్రదేశమున సస్యములకు హాని. నీచులకును, తస్కరులకును హాని.

10. జ్యేష్ఠ బ ప్రతిపత్ పో. ప్ర॥ అశ్వయుజ బ ఏకాదశి శు ప॥ జ్యేష్ఠానక్షత్రమున వృశ్చికాంతమున శని. ఫలము అనావృష్టి, దుర్భిక్షము అనగా ధరలు పెరుగుటయు నగును.

11. జ్యేష్ఠ బ ప్రతిపత్ పో ప్ర॥ నిజశ్రావణ శు దశమీ ఆ ప॥ వృశ్చికమందు శని వక్రము. ఫలము. మనుష్యులు పశువులు, సేనలు మూడు వంతులలో రెండు వంతులు నశించును.

12. ఆషాఢ శు నవమీ గు ప్ర॥ నిజశ్రావణ బ తృతీయా పో ప॥ మేషరాశియందు కుజ కేతు సమాగమము. ఫలము అంగ, వంగ, కళింగదేశములందు సస్యహాని, యుద్ధభయము, భూమియందు ప్రజలు భయభ్రాంతులయ్యెదరు.

13. అధికశ్రావణ శు పంచమీ పో. ప్ర॥ నిజశ్రావణ బ తృతీయా పో. ప॥ కుజ గురు సమసప్తకము. ఫలము. అయోధ్యనుండి దక్షిణదేశమున యుద్ధభయము, దుర్భిక్షము గలుగును.

14. నిజశ్రావణ బ తృతీయా పో. ప్ర॥ అశ్వ బ ఏకాదశి శు ప॥ కుజ శని సమసప్తకము. ఫలము (13 యో చూ.)

15. నిజశ్రావణ బ తృతీయా పో. ప్ర॥ కార్తిక శు సప్తమీ పో. ప॥ వృషభ తులా వృశ్చిక ధనూరాసులందు కుజ గురు శనులకు సంచారము. ఫలము (7 యో చూ.)

16. భాద్రపద బ ద్వాదశి శు ప్ర॥ మార్గశిర శు దశమీ శ ప॥ మేష వృషభములందు కుజవక్రము. ఫలము (11 యో చూ.)

17. అశ్వయుజ బ ఏకాదశి శు. ప్ర॥ మార్గశిర బ ద్వితీయా ఆ ప॥ గురునకు తృతీయమందు శని. ఫలము (1 యో చూ.)

18. అశ్వయుజ బ ఏకాదశి శు. ప్ర॥ వత్సరాంత ప॥ ధనూరాశియందు శని సంచారము. ఫలము (2 యో చూ.)

19. కార్తిక శు సప్తమీ పో. ప్ర॥ మార్గశిర బ ద్వితీయా ఆ ప॥ కుజ గురు సమసప్తకము. ఫలము (13 యో చూ.)

20. పౌష శు పూర్ణిమా శ. ప్ర॥ ఫాల్గున బ పంచమీ ఆ ప॥ కుజ గురు సమసప్తకము. ఫలము (13 యో చూ.)

21. పౌష శు పూర్ణిమా శ. ప్ర॥ సంవత్సరాంత ప॥ వృషభ మిథున వృశ్చిక ధనూరాసులందు కుజ గురు శనులకు సంచారము. ఫలము (7 యో చూ.)

22. ఫాల్గున బ పంచమీ ఆ. ప్ర॥ సంవత్సరాంత ప॥ కుజ శని సమసప్తకము. ఫలము (13 యో చూ.)

23. ఉత్తరాది ప్ర॥ ఆషాఢ బ అమా బు. ప॥ శిష్య గ్రోగజః॥ ఫలం॥ రోగభయం॥ మాఘ బ చతుర్దశీ ఆ ప్ర॥ ఉత్తరాంతి ప॥ శుక్రా గ్రోగజః, అనావృష్టిః, యుద్ధభయము.

## గ్రహ కూ ట ము లు

1. నిజశ్రావణ బ చతుర్దశీ ప్ర॥ దినత్రయే సింహే రవి చంద్ర బుధ శుక్రాః. (4 గ్రహములు)

2. భాద్ర బ ప్రతిపత్ ఆ॥ ప్ర॥ బ అమా ఆ.ప॥ కన్యాయాం రవి బుధ శుక్ర రాహవః. (4 గ్ర)

3. భాద్ర బ త్రయో శ. అమా ఆ. దినద్వయే రవి చంద్ర బుధ శుక్ర రాహవః కన్యాయాం పంచ.

4. ఆశ్వ బ చతుర్దశీ సో. అమా మం. దినద్వయే తులాయాం రవి చంద్ర గురు శుక్రాః. (4 గ్ర)

5. మార్గశిర బ త్రయోదశీ బు. చతుర్దశీ గు. అమా శు. దినత్రయే ధనుషి రవి చంద్ర బుధ శనయః.

6. ఫాల్గున బ చతుర్దశీ సో. అమా మం. పౌష శు ప్రతిపత్ బు. దినత్రయే మీనే రవి చంద్ర బుధ కేతవః.

ఫలము:—నాలుగు గ్రహము లొకచో గలిసినచో సరిహద్దు రాష్ట్రములతో కలహములు ఏడతెగక యుండును. ఐదు గ్రహములు గలిసినచో ప్రభువులకు హాని. మరియు సింహమందు గ్రహకూటము గల్గినచో వనావృష్టి, కన్యయందగుచో వాయుపీడ, తులయం దతి వృష్టి, ధనుర్మీనములం దారోగ్యమున్ను గలుగును.

## ముఖ్యమైన వ్రతములు—పండుగలు

చైత్రమాసము:—1879 శకం ఫాల్గున 30, శు ప్రతి సో తైలాభ్యంగః, నింబకుసుమభక్షణం, ప్రపాదానం, విషువత్పుణ్యకాలము, 1880 శకం చైత్ర 1 ద్వితీ శ ఉమాశివాగ్ని పూజ. చై 2 తృతీ ఆ సౌభాగ్యశయనవ్రతం, మాసగౌరీవ్రతం శివడోలోత్సవము. చై 4 పంచమం నాగపూజ శ్రీపంచమి, చై 6 సప్త గు సూర్యపూజ, చై 7 అష్ట శు భవానీయాత్రా అశోకరుద్రపూజ, అశోకకాలికా ప్రాశనం, చై 9 దశ ఆ ధర్మరాజదశమి, చై 10 ఏకా సో శ్రీకృష్ణ డోలోత్సవః, రుక్మిణీపూజ, చై 11 ద్వాద మం వామనద్వాదశి, చై 12 త్రయో బు శైవ చతుర్దశి, దమనేన శివపూజ, చై 13 చతుర్ద గు కర్దమక్రీడా, చై 14 పూర్ణి శు చిత్రవస్త్రదానం, దమనేనేంద్రాది సర్వదేవపూజ, చై 27 చతుర్ద గు శివసన్నిధి స్నానం.

వైశాఖమాసము:—చైత్ర 30 శు ప్రతి ఆ ధర్మఘటాదిదానం, వైశాఖ 2, తృతీ మం దధ్యన్న వ్యజన ఛత్ర పాదుకోపానహదానాని, ఉదకుంభదానం, గౌరీపూజ, లక్ష్మీనారాయణపూజ, త్రిలోచన యాత్రా, సింహాచలక్షేత్రే చందనోత్సవః వై 6, షష్ఠ శ గంగోత్పత్తి, వై 7 అష్ట ఆ అపరాజితాదేవి పూజ, చండికాదేవిపూజ, వై 10, ఏకా బు పరశురామద్వాదశి వై 13, పూర్ణి శ దధ్యన్న వ్యజన ఛత్రపాదుకోపానహదానాని, కృష్ణాజినదానం, ఉదకుంభదానం, సంపద్గౌరీవ్రతం, వై 21, బ అష్ట ఆ చండికాదేవిపూజ.

జ్యేష్ఠమాసము:—జ్యేష్ఠ 1, శు చతుర్థి గు ఉమాపూజ, జ్యే 5, అష్ట సో శుక్లాదేవిపూజ, జ్యే 6, నవ మం బ్రహ్మాణీదేవిపూజ, జ్యే 7, దశ బు సేతుబంధన రామేశ్వర ప్రతిష్ఠ, జ్యే 9, ద్వాద శు రామలక్ష్మణద్వాదశి, శ్రీమజ్జగద్గురు శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యాణాం కైలాసగమనం, జ్యే 10, త్రయో శ, విద్యారణ్యస్వామినా మారాధనం, జ్యే 11, పూర్ణి ఆ తిలపాత్రదానం, జ్యే 19, బ అష్ట సో, త్రిలోచనపూజ, జ్యే 26, చతుర్ద సో వటసావిత్రీవ్రతం.

ఆషాఢమాసము:—జ్యేష్ఠ 31 శు చతుర్థి శ మధ్యాహ్నోత్పరతః దక్షిణాయన పుణ్యకాలః, ఆషా 4, నవ బు ఐంద్రీదేవీపూజ ఆ 5, దశ గు మహాలక్ష్మీవ్రతారంభః, ఆ 6, ఏకా శు గోపద్మవ్రతారంభః, ఆ 7, ద్వాద శ, వాసుదేవ ౧౧ శ, ప్రసాపవన మహోత్సవః, చాతుర్మాస్య వ్రతారంభః, ఆ 9, చతుర్ద సో శివపవిత్రార్పణం, శివశయనం, కోకిలావ్రతం, శ్రీరంగక్షేత్రే జ్యేష్ఠాభిషేకః, ఆ 10, పూర్ణి మం, అన్నపానాదిదానం, ఆ 12 బ ద్వితీ గు చాతుర్మాస్య ౨ యు, ఆ 19, నవ గు ఐంద్రీదేవిపూజ.

అధికశ్రావణమాసము:—

నిజశ్రావణమాసము:—శ్రావణ 26, శు తృతీ ఆ, మధుశ్రవావ్రతం, శ్రా 27, చతుర్థి సో, దూర్వాగణపతివ్రతం, శ్రా 28, పంచమం, నాగ ౫ మి, శ్రా 29, షష్ఠి బు, సూర్యపూజ, శ్రా 31, అష్ట శు కౌమారీదేవిపూజ, భాద్ర 2, దశ ఆ, దధివ్రతారంభః, వేదవ్రతారంభః, భా 4, ద్వాద మం, దామోదర ౧౨ శ, భా 7, పూర్ణి శు, నవోపనీతానాం, తైత్తిరీయాణాం వాజసనేయానాం చోపాకర్మ, భా 8 బ ప్రతి శ, బృహత్తిల్వ ద్వితీయ, అశూన్య శయనవ్రతం, భా 10, తృతీ సో సంకష్ట ౪ ర్థి. భా 15, అష్ట శ, దశఫలవ్రతారంభః, దూర్వా ౮ మి, భా 16, నవ ఆ, కౌమారీదేవిపూజ, భా 22, అమా శ, రుద్రసావర్ణి మన్వాదిః, కుశగ్రహణం, ఉత్తరోమావ్రతం, పోలాల అమావాస్య.

భాద్రపదమాసము:—భాద్ర 23, శు ప్రతి ఆ, శైవ మౌన వ్రతం, భా 24, ద్వితీ సో, కల్కిజయంతి, భా 25, తృతీ మం, హరితాలికావ్రతం, సువర్ణగౌరీవ్రతం, శివారర్థి, కన్యాసంక్రమణము, భా 27, షష్ఠి గు, సూర్య షష్ఠీ, స్కందదర్శనము, బాదరజయంతి, భా 28, సప్త శు, అముక్తాభరణ ౭ మి, జ్యేష్ఠావ్రతం, భా 29, అష్ట శ, మహాలక్ష్మీవ్రతం, భా 30, నవ ఆ, నందాదేవిపూజ, కేదారవ్రతం, భా 31, దశ సో, క్షీరవ్రతారంభము, ఆశ్వీన 1, ఏకా మం, కటదానం, మధ్యాహ్నోత్పరతః విషువత్పుణ్యకాలః, ఆ 2, ద్వాద బు, శక్రద్వాదశి, శక్రధ్వజోత్థాపనం, విష్ణుపరివర్తనమహోత్సవః, కల్కి ౧౨ శ, ఆ 4, చతుర్ద శు అనంతవ్రతం, ఆ 5, పూర్ణి శ, ఉమామహేశ్వరవ్రతం, లోకపాలకపూజ, ఆ 7, బ ద్వితీ సో, అశూన్యశయనవ్రతం, ఆ 8, ద్వితీ మం, బహులావ్రతం, విశాలాక్షీయాత్రా, ఆ 11, పంచ శు, చంద్రషష్ఠి, ఆ 14, అష్ట సో, ఆర్ద్రాష్టమీ త్ర్యంబకమహేశ్వరపూజ, ఆ 18, ద్వాద శు, గజచ్ఛాయా, కలియుగాది, ఆ 20, చతుర్ద ఆ కుశగ్రహణం.

ఆశ్వయుజమాసము:—ఆశ్వ 21, శు ప్రతి సో దౌహిత్ర ప్రతిపత్, కలశస్థా॥ స్తనవృద్ధి గౌరీవ్రతం, ఆ 24, చతుర్థి గు, ఉపాంగలలితాగౌరీవ్రతం, ఆ 25, పంచ శు, నాగపూజ, తులా సంక్రమణము. ఆ 29, నవ మం, అపరాజితా దేవిపూజ, శమీపూజ, దుర్గాదేవ్యుద్వాసనం, ఆ 30, దశ బు, దశరథ గౌరీవ్రతం, ద్వదశీ వ్రతారంభః, కార్తిక 2, ద్వాద శు గోద్వాదశి, పద్మనాభ ౧౨ శ, కా 4, చతుర్ద ఆ, దానఫలవ్రతారంభః, కౌముదీ ౧౫ మ, కా 7, బ ద్వితీ బు, అశూన్యశయనవ్రతం, కా ౯ తృతీ గు, లలితాదేవి యాత్రా, కా 13, త్రయో ఆ బహిర్దీపదానం, యమతర్పణంచ, కా 19, చతుర్ద సో, ప్రేత ౧౪ శ, మాషపత్రభక్షణం, దీపదానం, కా 20, అమా మం, కేదారవ్రతం, ఉల్కాప్రదర్శనం, దీపదానం అలక్ష్మీనిస్సరణం, గోక్రీడనం.

కార్తికమాసము:—కార్తిక 21, శు ప్రతి బు, అఖండదీప ప్రా॥ మంగళమాలికా, యమ ౨ య, భగినీహస్త భోజనం. కా 2, తృతీ గు త్రిలోచన గౌరీవ్రతం, కా 25, షష్ఠి ఆ, వృశ్చిక సంక్రమణము కా 26 శ్రీ మద్విద్యాశంకర భగవత్పాద తీర్థానాం లంబికా యోగ ప్రవేశః, కా 27, అష్ట మం, గోష్ఠాష్టమి, కా 30, ఏకా శు దేవోత్థాపనం భీష్మపంచక వ్రతారంభః, ఆగ్రహాయణం, ద్వాద శ, చిల్క ౧౨ శ, యోగి ౧౨ శ, అగ్ర 3, త్రయో సో, వైకుంఠ ౧౪ శ, పాషాణ ౧౪ శ, అగ్ర 4, చతుర్ద మం, ఉదయే విశ్వేశ్వర

నుండును. పప్పు పదార్థములు తైలములు ధర చురుకుగ నుండును. కొబ్బరి, అరటి, పసుపు మాసాంతమునకు ధర మందమైనవగును. వెండి ధర తగ్గును బంగారమునకు బహుళములో ధర హెచ్చును.

పౌషమాసము:—శు ౨ ఆ. ప॥ బుధాగ్రశని. బ ౨ పో. ప॥ బుధ శనుల శేక రాశ్యంశయుతి. శు ౨ ఆ. బుధ శనియుతి. మాస మంతటను శుక్రాగ్ర కుజుడు (కేతువ్యవధానము) శు ౨ ఆ. ప్ర॥ సూర్యాగ్ర శని. పురశ్శుక్ర రవి మధ్యమము. ఇత్యాద్యనావృష్టి యోగములు— మాస మంతయు పురశ్శుక్రుడు. (శుక్రాగ్ర కుజుడు) బ ౧౫ శ. వృషభమున కుజుడు. ఇత్యాది వర్షయోగములు గలవు. ఇందపుడపుడు మేఘాడంబరము గలుగుచుండును.

ధరలు:—ధాన్యము వస్త్రములును బహుళమున ధర గలవి యగును. కొబ్బరి అరటి పసుపు మందముగ నుండును. బెల్లము. శర్కర, మధుర వస్తువులు. కొంచెము చురుకు గావచ్చును. పప్పు పదార్థములు దుర్లభములుగ నుండును. బంగారమునకు ధర మంద మగును. వెండికి బహుళములో ధర చురుకగును.

మాఘమాసము:—శు ౬ శ. ప॥ పురశ్శుక్ర రవి మధ్యమము. బ ౧౪ ఆ. ప॥ శుక్రాగ్రకుజుడు. (కేతు వ్యవధానం) మాసమంతయు సూర్యాగ్ర శని. శు ౬ శ. ప్ర॥ పురోబుధుడు. శు ౯ మం. ప్ర॥ రోహిణీ కుజుడు. బ ౧౪ ఆ. ప్ర॥ కేవల శుక్రాగ్రకుజుడును అనావృష్టి యోగములు—శు ౬ శు. ప్ర॥ శు ౧౦ బుధ శుక్రుల శేక రాశి. శు ౬ శ. ప్ర॥ బుధాగ్ర శుక్రుడు. (శుక్రాగ్రకుజుడు) బ ౩ ఆ. ప్ర॥ బుధ శుక్రుల కోశ రాశి ఇత్యాది వర్షయోగములు గలవు. ఇందు అపుడపుడు స్వల్ప మేఘాడంబరము గలిగి తఱుచు గాలి వీచు చుండును.

ధరలు:—ధాన్యము, వస్త్రములు, ధర గలిగి యుండును. బెల్లము, శర్కర, మధుర వస్తువులును క్రమముగ ధర గలవి యగును. కొబ్బరి, అరటి, పసుపు, మాసాంతమునకు కొంచెము ధర చురుకైనవి యగును. పప్పు పదార్థములు తైలములు క్రమముగ సులభము లగును. పూర్ణిమా ప్రాంతమున వెండికి కొంచెము ధర గలుగును. బంగారమునకు ధర నిలబాటుగ నుండును.

ఫాల్గునమాసము:—మాస మంతయు శుక్రాగ్రకుజుడు. సూర్యాగ్ర శని. బ ౫ ఆ. ప॥ పురోబుధుడు. శు ౯ పో. ప॥ రోహిణ్యంగారకుడు. బ ౫ ఆ. ప్ర॥ వత్సరాంత పర్యంతము పురశ్శుక్ర రవి మధ్యము. ఇవి అనావృష్టి యోగములు—బ ౩ శు. ప॥ బుధాగ్ర శుక్రుడు (శుక్రాగ్రకుజుడు) శు ౬ ఆ. ప॥ బుధ శుక్రుల శేకరాశి. శు ౩ పో ప్ర॥ వత్సరాంతపర్యంతము మృగశిర్షాంగారకుడు. శు ౯ గు. ప్ర॥ వత్సరాంత పర్యంతము బుధవక్రము. బ ౫ ఆ. మిథునమున కుజుడు. ఇత్యాది వర్షయోగములును గలవు. ఇందు పూర్ణిమా ప్రాంతమునుండి అదటదట మబ్బులు అధికముగ నుండును. గాలి వీచుచుండును. అమా ప్రాంతమున వదటచట పర్వత ప్రాంతములందు మంచి వానలును గలుగవచ్చును.

ధరలు:—ధాన్యము వస్త్రములు క్రమముగ ధర గలిగి దుర్లభము లగును. బెల్లము శర్కర మధుర వస్తువులు కొబ్బరి, అరటి, పసుపు, మొదలగునవి ధర నిలబాటు గలిగియుండును పప్పు పదార్థములు కొంచెము చురుకుగను. బంగారమునకు ధర మందముగ నుండును. వెండికి ధర బహుళములో మొదట చురుకగును.

N. B. పై గ్రహయోగములందు పురోబుధుడు, పురోగురుడు పురశ్శుక్రుడు మొదలగు యోగములందు ముందువెనుకలు రవిని బట్టి యని గ్రహింపవలయును.

---

## గోచార ఫలములు

ఈ ఫలములు జన్మకాలిక నక్షత్రమునకైన రాశి (చంద్ర లగ్నము) వలన గాని, నామనక్షత్రమునకైన రాశివలన గాని తెలియవలయును. కాని జన్మలగ్నమునుబట్టి గూడఫలములను చూచి రెండిటికి వచ్చు ఫలమును కలిపి గ్రహించుట యుక్తము.

### మేషము (అశ్విని, భరణి, కృత్తిక 1 పాదం)

ఈ రాశివారికి సగటున రాబడియు, సౌఖ్యములును బాగుగనే యుండును. కాని గురుని కష్టమ స్థితి జనవరినుండి గలుగుట రాహు కేతువులు శనియు మంచివారైనను అనారోగ్యము ప్రయాణములచే క్లేశము గలుగుచుండును. జ్యేష్ఠాషాఢములలో ఏరు నూతన కార్యములను ఆరంభింపక పోవుట మంచిది. అధిక నిజశ్రావణములలో ఉదరకు సంబంధమైన అనారోగ్యము గలుగవచ్చును. వర్తకులకు వ్యవసాయదారులకు శ్రమాధిక్యమున్నను ఫలితము కొంచెము గలుగును. ఉద్యోగులకు అక్టోబరు నవంబరు డిశెంబరులలో అభివృద్ధి గలుగవచ్చును. విద్యార్థులకు సెప్టెంబరు అక్టోబరులు పరీక్షలకు తగినవి.

### వృషభము (కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా)

ఈ రాశివారికి మనోవ్యాకులత, గృహకలహములు, శరీరానారోగ్యము తొలుత 2 మాసములు కలవర పెట్టును గాని తర్వాత మధ్య కాలములో 2 మాసములు ప్రయాణములు తిరుచు గలిగినను విశ్రాంతి యుండును. అధికశ్రావణమునుండి తిరుగ 2 మాసములు పొత్తిగ విశ్రాంతి లభింపని స్థితి యేర్పడినను తర్వాత క్రమక్రమముగ ఒక వంక శరీరమందును కుటుంబమందును అనారోగ్యములు గలుగుచున్నను కుటుంబసౌఖ్యముచే ఇవియన్నియు సమసిపోగలవు. భాద్రపదాశ్వయుజములందును మాఘ ఫాల్గునములందును శరీరానారోగ్యము కొంచెము గలుగును. వర్తకులకు వ్యాపారము కర్షకులకు వ్యవసాయము విశేష లాభకరముగ నుండకపోయినను ఉత్తరార్థమున మిశ్రమఫలము గలిగి కొంచెము లాభముగ నుండును. ఉద్యోగులకు జనవరినుండి కొంత ఉపయోగము గలదు. విద్యార్థులు అనారోగ్యములచే విశేషశ్రమ పడినగాని స్వల్పఫలమునైన నందజాలరు.

### మిథునము (మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా)

ఈ రాశివారికి మొదట 2 మాసములవరకు ప్రయాణక్లేశము ధనవ్యయము గలిగినను మధ్యకాలములో ధనలాభము కార్యసిద్ధి, వివాదములందు జయము, సంతతి సౌఖ్యము గలుగును. తిరిగి జనవరినుండి ధనవ్యయము, మనఃక్లేశము ప్రయాణాదులచే శ్రమయు గలుగును. మధ్యకాలము చాల మంచిది. ఉద్యోగులకు జీతాభివృద్ధి లభించును. వర్తకులకు మధ్యకాలములో మంచి లాభములు గలుగును. వ్యవసాయదార్లకు మొదటి పంట మంచి లాభప్రదము. రెండవ పంటలో లాభనష్టములు సమముగ నుండును. జనవరినుండి పెట్టుబడి హెచ్చును. విద్యార్థులకు సెప్టెంబరు అక్టోబరులు మంచి ఫలితము నియ్యగలవు. సగటున ధనవ్యయ మీ రాశిగలవారికి అధికమగును.

### కర్కాటకము (పునర్వసు 4 పా, పుష్య, ఆశ్రేష)

ఈ రాశివారికి గ్రహసంచారము మంచి ఫలితము నిచ్చును. సగం కాలమువరకు సామాన్యముగ నున్నను ఉత్తరార్థము కార్యసిద్ధి, కళత్రసౌఖ్యము, శత్రుజయము, ఉత్సాహము మొదలగు అనేక శుభ ఫలముల గలుగచేయును. విద్యార్థులకు విద్యాభివృద్ధి, వ్యవసాయదారులకు మంచి పంటలు, ఉద్యోగులకు ఉన్నతాధికారము జీతాభివృద్ధి ఉత్తరార్థమున గలుగును. మొదట కళత్రానారోగ్యము, మధ్యకాలములో సంతతికి అనారోగ్యము కొంచెము గలిగినను అవి గణింపదగినవి గావు.

### సింహము (మఘ, పూఫ. ఉఫ 1 పా)

ఈ రాశివారికి పూర్వార్థకాలము చాల మంచిది. కాని అందు వైశాఖాదిగ 8 మాసములు కళత్రసౌఖ్యము తక్కువగ నుండును. కాని కార్యసిద్ధి ధనలాభము గౌరవము గలుగును. ఉత్తరార్థ కాలములో ధనమునకు వ్యయమధికము. సుఖము అల్పముగ నుండును మనోవ్యాకులత్వము గలుగుచుండును. కాని వ్యవసాయదార్లకు పంటలు అనుకూలముగ నుండును. వర్తకులకు వ్యాపారమువలన లాభములు గలుగును. ఉద్యోగులకు మధ్యమముగ నుండును. విద్యార్థులు పరిశ్రమ చేయవలయును. ఉత్తరార్థమే విద్యార్థులకు ప్రయోజనకరముగ నుండును.

### కన్య (ఉఫ 2, 3, 4 హస్త, చిత్త 1, 2 పా)

ఈ రాశివారికి మిశ్రమముగ నుండును. ఒకవైపు మనోవిశ్రాంతి లేకున్నను, అప్రయత్నముగ కార్యసిద్ధి, ధనలాభము గలుగుటచే మనోధైర్యము గలుగుచుండును. జ్యేష్ఠాషాఢాధికశ్రావణములందు కళత్రమునకు గాని తనకు గాని అనారోగ్యములు గలుగుటచే కళత్ర సౌఖ్యము తగ్గుచుండును. ఉత్తరార్థకాలమున కార్యవిఘాతము, స్థానచలనము, బంధుమిత్రులతో ఎడబాటు, శరీరానారోగ్యము మొదలగువాటిచే మనశ్శాంతి లేకున్నను విశేషశ్రమలేక దేవతారాధనచే సుఖమునందుట గలుగును. ప్రారంభకాలమున ధనవ్యయమైనను విశేష లాభము సంతతి సౌఖ్యము, శుభకార్యములు వీటిచే ఆనందము గలుగును. పూర్వార్థకాలమున వ్యాపారముచే వర్తకులకు లాభము గలుగును, వ్యవసాయదారులకు కృషి ఫలించును. ఉద్యోగులకు ఉన్నతాధికారప్రాప్తి, విద్యార్థులకు విద్యాభివృద్ధి. ఉత్తరార్థకాలమున విద్యార్థులకు పరిశ్రమ చాల ఆవశ్యకము. గ్రహచారము నమ్మదగినది గాదు.

### తుల (చిత్త 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా)

ఈ రాశివారికి పూర్వార్థకాలముకంటె నుత్తరార్థకాలము మంచిది. అందు మధ్యకాలము ఆషాఢ, శ్రావణ, భాద్రపదాశ్వయుజములు సుఖకరములు గావు. మొదట చైత్ర వైశాఖములు జ్యేష్ఠంలో కొంతవరకును అంత శ్రమకరముగాదు. ఆ కాలము మిశ్రముగ నుండును. ఈ మిశ్రకాలములో ధనవ్యయము దేహశ్రమ మిత్రకలహములు గలుగుచున్నను. విశేష ధనలాభము, అభీష్టకార్యసిద్ధి గలుగును. ఉత్తరార్థకాలమునందు ఉద్యోగులకు జీతనాభివృద్ధి, విద్యార్థులకు విద్యాభివృద్ధి, వివాహాది శుభకార్యప్రాప్తి, గౌరవము సన్మానము జరుగును. వర్తకులకు విశేష లాభములు వ్యవసాయదారులకు మంచి పంటలు గలుగును. మధ్యకాలములో ఎవరైనను దేవతా పూజాదులచే గ్రహశాంతి చేసికొనుట మంచిది. సగటున ధన లాభము శుభకార్యములు మొదలగు మంచి ఫలములు గలుగుచున్నను భాద్రపదమాసమునకు ముందునుండి సంవత్సరాంతమువరకు తనకు గాని భార్యకు గాని అనారోగ్యము మొదలగునవి గలుగుటచే కళత్ర సౌఖ్యము తక్కువగ నుండును.

### వృశ్చికము (విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ రాశివారికి ఇంకను శ్రమపడవలసిన రోజులు గలవు. శని చారము మంచిది గాదు. కాని జ్యేష్ఠాషాఢములలో గురుడు శుభుడు. ఉత్తరార్థ కాలమునందు రాహుచారము శుభము. గావున దేహశ్రమ ధనవ్యయము గలుగుచున్నను, ధనలాభము, కార్యసిద్ధియు కొంత గలుగుచుండును. మధ్య మధ్య కళత్రసౌఖ్యమునకు విఘాతము గలిగినను కార్యసిద్ధి శత్రుజయములున్ను గలుగుచుండును. వర్తకులకు వ్యవసాయదారులకు ఉద్యోగులకు శ్రమ అధికమైనను కొంచెము ఫలము గూడ గలుగుచుండును. విద్యార్థులకు సంవత్సరాంత్యకాలము కొంత మేలుచేయగలదు. ఉత్తరార్థకాలములో లాభప్రాప్తి బుద్ధి వికాసమున్ను దేహశ్రమ మనోవ్యాకులతయున్నను గలుగుచుండును.

### ధనుస్సు (మూల, పూషా, ఉషా 1 పా)

ఈ రాశివారికి పరదేశప్రయాణములు బంధుజన దూరస్థితి, మిత్రవియోగము గలుగుచున్నను, పుణ్యతీర్థయాత్రలు, తన్మూలక

ధనవ్యయము, శత్రుజయము, కార్యసిద్ధి ధనలాభము గలుగును. మనో వ్యాకులత్వము గూడ సంభవించుచున్నను, అది నిలచునదిగాదు. పరిశ్రమ చేయువారల పరిశ్రమ ఫలించును. వ్యాపారము చేయువారలకు ధనలాభము గలుగును గాని జనవరి మొదలు శుభకార్యముల గూర్చి ధనవ్యయ మధిక మగును. ఉద్యోగులకు కొన్ని కలహములు గలుగును. కాని అవి నశించి లాభప్రదముగ పరిణమించును. కర్షకులును వ్యవసాయదారులును విశేష ధనవ్యయము అధిక పరిశ్రమ గలిగిన ధనార్జనమును జనవరినుండి చేయుదురు. విద్యార్థులకు సెప్టెంబరు అక్టోబరులు చాల మంచివి. వినను పరిశ్రమ సఫలము గాకపోదు.

మకరము (ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఈ రాశిగలవారికి శ్రమ, ధనవ్యయము గలుగుచున్నను మొత్తము సంవత్సరమంతయు లాభప్రదముగ నుండును. సత్కార్యలం దాసక్తి హెచ్చగును. జ్ఞానసంబంధమైన విచారమును చేయుదురు. వ్యవసాయము లాభప్రదమగును. కర్షకులకు వ్యాపారము కొంచెము చిక్కులతో గూడియున్నను మొత్తము లాభ మధికముగనే యుండును. కాని వీరి సంతతికి తల్లి లేక తల్లివంటివారికి అనారోగ్యాదులచే వ్యాకులత నందెదరు. విద్యార్థులకు విద్య చురుకుగనే యుండును. ఉద్యోగులు మంచి అభివృద్ధిని బొందగలరు.

కుంభము (ధనిష్ఠ 3, 4 పా, శతతార, పూభా 1, 2, 3 పా)

ఈ రాశివారికి సంవత్సరము సగటున చాల మంచిదిగనే యుండును. గాని జ్యేష్ఠాషాఢములలో శరీరానారోగ్యము ప్రయాణశ్రమ మనఃకాలుష్యము గలుగును. గాని తదితర కాలములందు పరమార్థచింత ధర్మకార్యములు తీర్థయాత్రాసక్తి, ఉద్యోగులకు ఉన్నత పదవీ ప్రాప్తి. కర్షకులకు ధనలాభము, వ్యవసాయదారులకు విశేష లాభకరమగు పంటలు గలుగును. విద్యార్థులు ధైర్యముతో విద్యా పరిశ్రమ చేయగలరు. ఉత్తరార్ధకాలము కొంచెము ధైర్యమును పోగొట్టును. సగటున మంచిది.

మీనము (పూభా 4 పా, ఉభా, రేవతి)

ఈ రాశివారికి పూర్వార్ధ కాలమునందు ధర్మకార్యములు సాగవు. ఉత్తరార్ధకాలమున అపవాదముచే మనఃక్లేశము, కీర్తి భంగము, గాని చాల ధైర్యముతో నుండగలరు. మధ్యకాలములో విశ్రాంతి బాగుగ లేదును. మొదట గూడ విశ్రాంతికి భంగము గలుగును. ఉత్తరార్ధకాలమందు ఆరోగ్యమునకు భంగము గలుగు సూచనములు గలుగును. ధైర్యముయొక్క అవలంబనముచే అవి యన్నియు నశించును. ఆచారమార్గములు వీరికి పూర్తిగ నశించును. కాని సంవత్సరాంత్యకాలమున తిరుగ ధర్మకర్మాసక్తి తలయెత్తును. కర్తకులు కర్షకులు ఉద్యోగులు విద్యార్థులు సంవత్సరాంత్యకాలమున జనవరి నుండి మంచి ఫలితము నందగలరు. అప్పుడప్పుడు మధ్యకాలమందు కుటుంబానారోగ్యము గలుగుచుండును. విద్యార్థులకు పరీక్షాకాలము మార్చి అనుకూలముగనే యుండును.

---

## నామ నక్షత్ర పరిజ్ఞానము

| | | | |
|---|---|---|---|
| చూ, చే, చో, లా | =అశ్విని | రూ, రే, రో, తా | =స్వాతి |
| లీ, లూ, లే, లో | =భరణి | తీ, తూ, తే, తో | =విశాఖ |
| ఆ, ఈ, ఊ, ఏ | =కృత్తిక | నా, నీ, నూ, నే | =అనూరాధ |
| ఓ, వా, వీ, వు | =రోహిణి | నో, యా, యీ, యూ | =జ్యేష్ఠ |
| వే, వో, కా, కి | =మృగశిర | యే, యో, బా, బి | =మూల |
| కూ, ఘ, ఙ, ఛ | =ఆర్ద్ర | బూ, ధ, భ, ఢా | =పూ.షాఢ |
| కే, కో, హా, హీ | =పునర్వసు | బే, బో, జా, జీ | =ఉ.షాఢ |
| హూ, హే, హో, డా | =పుష్యమి | జూ, జే, జో, ఖా | =అభిజిత్ |
| డీ, డూ, డే, డో | =ఆశ్రేష | ఖీ, ఖూ, ఖే, ఖో | =శ్రవణం |
| మా, మీ, మూ, మే | =మఖ | గా, గీ, గూ, గే | =ధనిష్ఠ |
| మో, టా, టీ, టూ | =పుబ్బ | గో, సా, సీ, సు | =శతభిషం |
| టే, టో, పా, పీ | =ఉత్తర | సే, సో, దా, ది | =పూ.భాద్ర |
| పూ, ష, ణ, ఠ | =హస్త | దూ, శ, ఝ, థ | =ఉ.భాద్ర |
| పే, పో, రా, రీ | =చిత్త | దే, దో, చా, చీ | =రేవతి |

27 నక్షత్రములలోని, యక్షరములనుబట్టి వారివారి పేర్లకే నక్షత్రమో పాదమునునో తెలుసుకొనునది. (కృష్ణుడు వ్యాష్ణుడు అను కొన్ని పేర్లకు ప్రత్యేక నక్షత్రము లున్నవి.

(రాజమండ్రికి) I. S. T ఉదయాస్త గంటలు. 1880 శకం (1958-59)

| తేదీ | చైత్రం ఉ.గ | చైత్రం అ.గ | వైశాఖం ఉ.గ | వైశాఖం అ.గ | జ్యేష్ఠం ఉ.గ | జ్యేష్ఠం అ.గ | ఆషాఢం ఉ.గ | ఆషాఢం అ.గ | శ్రావణం ఉ.గ | శ్రావణం అ.గ | భాద్రం ఉ.గ | భాద్రం అ.గ | ఆశ్వయం ఉ.గ | ఆశ్వయం అ.గ | కార్తికం ఉ.గ | కార్తికం అ.గ | మార్గం ఉ.గ | మార్గం అ.గ | పౌషం ఉ.గ | పౌషం అ.గ | మాఘం ఉ.గ | మాఘం అ.గ | ఫాల్గునం ఉ.గ | ఫాల్గునం అ.గ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 6-8 | 6-18 | 5-45 | 6-18 | 5-32 | 6-28 | 5-32 | 6-37 | 5-41 | 6-37 | 5-49 | 6-23 | 5-53 | 5-58 | 5-59 | 5-35 | 6-13 | 5-26 | 6.30 | 5-33 | 6-38 | 5-51 | 6-29 | 6-5 |
| 3 | 6-6 | 6-18 | 5-44 | 6-19 | 5-31 | 6-28 | 5-33 | 6-38 | 5-42 | 6-37 | 5-50 | 6-21 | 5-54 | 5-56 | 6-0 | 5-34 | 6-14 | 5-25 | 6-31 | 5-34 | 6-38 | 5-52 | 6-28 | 6-6 |
| 5 | 6-5 | 6-18 | 5-43 | 6-19 | 5-31 | 6-29 | 5-33 | 6-38 | 5-43 | 6-36 | 5-50 | 6-19 | 5-54 | 5-55 | 6-1 | 5-34 | 6-15 | 5-25 | 6-32 | 5-35 | 6-38 | 5-53 | 6-26 | 6-6 |
| 7 | 6-3 | 6-14 | 5-42 | 6-20 | 5-31 | 6-29 | 5-34 | 6-38 | 5-43 | 6-35 | 5-50 | 6-18 | 5-54 | 5-53 | 6-1 | 5-32 | 6-16 | 5-26 | 6-32 | 5-36 | 6-37 | 5-54 | 6-25 | 6-7 |
| 9 | 6-2 | 6-14 | 5-41 | 6-20 | 5-30 | 6-30 | 5-34 | 6-38 | 5-44 | 6-35 | 5-50 | 6-16 | 5-54 | 5-51 | 6-2 | 5-31 | 6-17 | 5-26 | 6-34 | 5-38 | 6-37 | 5-55 | 6-24 | 6-8 |
| 11 | 6-0 | 6-14 | 5-40 | 6-21 | 5-30 | 6-31 | 5-35 | 6-39 | 5-44 | 6-33 | 5-51 | 6-15 | 5-55 | 5-50 | 6-3 | 5-30 | 6-18 | 5-26 | 6-34 | 5-38 | 6-37 | 5-55 | 6-23 | 6-8 |
| 13 | 5-58 | 6-15 | 5-39 | 6-22 | 5-30 | 6-32 | 5-35 | 6-39 | 5-45 | 6-33 | 5-51 | 6-13 | 5-55 | 5-48 | 6-4 | 5-30 | 6-20 | 5-26 | 6-35 | 5-40 | 6-36 | 5-57 | 6-21 | 6-9 |
| 15 | 5-57 | 6-15 | 5-38 | 6-22 | 5-30 | 6-32 | 5-36 | 6-39 | 5-45 | 6-32 | 5-51 | 6-12 | 5-55 | 5-46 | 6-5 | 5-29 | 6-21 | 5-27 | 6-36 | 5-41 | 6-36 | 5-58 | 6-20 | 6-9 |
| 17 | 5-55 | 6-15 | 5-36 | 6-22 | 5-30 | 6-33 | 5-37 | 6-39 | 5-46 | 6-31 | 5-52 | 6-10 | 5-56 | 5-45 | 6-5 | 5-28 | 6-22 | 5-27 | 6-36 | 5-42 | 6-35 | 5-59 | 6-19 | 6-10 |
| 19 | 5-54 | 6-16 | 5-35 | 6-23 | 5-30 | 6-34 | 5-37 | 6-39 | 5-47 | 6-31 | 5-52 | 6-9 | 5-56 | 5-43 | 6-6 | 5-27 | 6-23 | 5-28 | 6-36 | 5-43 | 6-34 | 6-0 | 6-17 | 6-10 |
| 21 | 5-52 | 6-16 | 5-35 | 6-24 | 5-30 | 6-34 | 5-38 | 6-39 | 5-47 | 6-29 | 5-52 | 6-7 | 5-57 | 5-42 | 6-7 | 5-27 | 6-24 | 5-28 | 6-37 | 5-45 | 6-33 | 6-1 | 6-16 | 6-11 |
| 23 | 5-51 | 6-17 | 5-34 | 6-24 | 5-31 | 6-35 | 5-39 | 6-39 | 5-47 | 6-28 | 5-52 | 6-5 | 5-57 | 5-41 | 6-8 | 5-26 | 6-25 | 5-29 | 6-38 | 5-46 | 6-33 | 6-2 | 6-14 | 6-11 |
| 25 | 5-49 | 6-17 | 5-33 | 6-24 | 5-31 | 6-35 | 5-39 | 6-38 | 5-48 | 6-27 | 5-52 | 6-3 | 5-58 | 5-40 | 6-9 | 5-26 | 6-26 | 5-30 | 6-38 | 5-47 | 6-32 | 6-3 | 6-13 | 6-12 |
| 27 | 5-48 | 6-18 | 5-33 | 6-26 | 5-31 | 6-36 | 5-40 | 6-38 | 5-48 | 6-27 | 5-53 | 6-2 | 5-58 | 5-38 | 6-10 | 5-26 | 6-28 | 5-31 | 6-38 | 5-48 | 6-31 | 6-4 | 6-11 | 6-12 |
| 29 | 5-47 | 6-18 | 5-32 | 6-26 | 5-32 | 6-37 | 5-40 | 6-38 | 5-49 | 6-25 | 5-53 | 6-0 | 5-59 | 5-37 | 6-11 | 5-26 | 6-29 | 5-32 | 6-38 | 5-49 | 6-30 | 6-4 | 6-9 | 6-12 |
| 31 | | | 5-32 | 6-27 | 5-32 | 6-37 | 5-41 | 6-37 | 5-49 | 6-23 | 5-53 | 5-59 | | | | | | | | | | | | |

## నవాంశ లగ్నము

శ్లో॥ విధాయలగ్నం నవభిర్విభాగం। యద్భాగసంస్థం జననం శ్రుతేన।
నవాంశపావానియమోయథా స్తి। తథానవాంశేపిజనం తిలగ్నం॥

తా॥ జన్మలగ్నమును 9 భాగములు చేయగా జననకాల మెన్నవభాగమందుండునో ఆభాగమునుసరించి నవాంశాధి పతు లను తెలుసుకొనివప్రకారమే నవాంశలగ్నమును నిర్ణయించవలెను.

## లగ్నాధిపతులు

శ్లో॥ సింహస్యాధిపతి స్సూర్యః కర్కటస్య నిశాకరః।
మేష వృశ్చికయోర్భౌమః కన్యా మిథునయోర్బుధః।
కోదండమీనయోర్మంత్రీ తులా వృషభయోర్భృగుః।
మకరస్య కుంభరాశేశ్చ నాయక స్సూర్యనందనః॥

తా॥ సింహమునకు సూర్యుడు, కర్కటమునకు చంద్రుడు, మేష, వృశ్చికములకు అంగారకుడు, కన్యా, మిథునములకు బుధుడు, ధనుర్మీనములకు బృహస్పతి, తులా వృషభములకు శుక్రుడు, మకర కుంభములకు శని అధిపతులు.

## గ్రహములకు ఉచ్చనీచలు

సూర్యునకు మేషము ఉచ్చ, తుల నీచ. చంద్రునకు వృషభము ఉచ్చ, వృశ్చికము నీచ. అంగారకునకు మకరము ఉచ్చ, కర్కాటకము నీచ. బుధునికి కన్య ఉచ్చ, మీనము నీచ. బృహస్పతికి కర్కాటకము ఉచ్చ, మకరము నీచ. శుక్రునకు మీనము ఉచ్చ, కన్య నీచ. శనికి తుల ఉచ్చ, మేషము నీచ.

## ఉచ్చనీచ మూలత్రికోణ స్వక్షేత్రములు

సూర్యునికి మేషమందు 10-వ భాగము పరమోచ్చ, తులయందు 10-వభాగము పరమనీచ, సింహముస్వక్షేత్రముమూలత్రికోణము.

చంద్రునికి వృషభమందు 3-వ భాగము పరమోచ్చ, వృశ్చికమందు 3 భాగము పరమనీచ, వృషభము మూలత్రికోణము.

కుజునికి మకరమందు 28-వ భాగము పరమోచ్చ, కర్కటమందు 28-వభాగము పరమనీచ, మేషము స్వక్షేత్రము మూలత్రికోణము.

బుధునికి కన్యయందు 15-వ భాగము పరమోచ్చ, మీనమందు 15-వభాగము పరమనీచ, కన్య స్వక్షేత్రముమూలత్రికోణము.

బృహస్పతికి కర్కటకమందు 5-వ భాగము పరమోచ్చ, మకరమందు 5-వభాగము పరమనీచ, ధనుస్సు స్వక్షేత్రముమూలత్రికోణము.

శుక్రునికి మీనమందు 27-వ భాగము పరమోచ్చ, కన్యయందు 27-వభాగము పరమనీచ, తులస్వక్షేత్రము మూలత్రికోణము.

శనికి తులయందు 20-వ భాగము పరమోచ్చ, మేషమందు 20-వ భాగము పరమనీచ, కుంభము స్వక్షేత్రము మూలత్రికోణము.

ఉచ్చరాశి శేషరాశి నీచరాశి యగుచుండును. పరమోచ్చ భాగమునకు ఇతరభాగములు సామాన్యోచ్చ భాగములనియు, పరమనీచభాగమునకు ఇతరభాగములు సామాన్య నీచ భాగములనియు తెలియవలెను.

---

## గ్రహములకు మిత్రత్వ శత్రుత్వ సమత్వములు

శ్లో॥ శత్రూమంద సితౌసమశ్చశశిజో మిత్రాణిశేషారవే
స్తీక్ష్ణాంశు ర్హిమరశ్మిజశ్చసుహృదౌ శేషాస్సమాశ్శీతగోః॥
జీవేందూష్ణకరాః కుజస్యసుహృదోజ్ఞోరిస్సితార్కీ సమౌ।
మిత్రే సూర్యసితౌ బుధస్య హిమగుశ్శత్రుస్సమాశ్చాపరే
సూరేస్సౌమ్య సితావరీ రవిసుతో మధ్యో పరేత్వన్యథా
సౌమ్యార్కీ సుహృదౌ సమౌ కుజగురూ శుక్రస్య శేషావరీ॥
శుక్రజ్ఞౌ సుహృదౌ సమస్సురగురు స్సౌరస్యచాన్యేరయః
(యేప్రోక్తాస్స్వత్రికోణభాదిషు పున స్తేమీమయాకీర్తితాః)

తా॥ సూర్యునకు—శుక్ర, శనులు శత్రువులు. బుధుడు సముడు. ఇతరులుమిత్రులు. చంద్రునకు—సూర్య, బుధులుమిత్రులు. ఇతరులు సములు శత్రువు లేడు. కుజునకు—రవి, చంద్ర, గురులు మిత్రులు. బుధుడు శత్రువు. శుక్ర, శనులు సములు. బుధునకు—రవి, శుక్రులు మిత్రులు. చంద్రుడు శత్రువు. ఇతరులు సములు. గురునకు—బుధ, శుక్రులు శత్రువులు. శని సముడు. ఇతరులు మిత్రులు. శుక్రునకు—బుధ, శనులు మిత్రులు. కుజ, గురులు సములు. ఇతరులు శత్రువులు. శనికి—బుధ, శుక్రులు మిత్రులు. గురుడు సముడు. ఇతరులు శత్రువులు. (మూల త్రికోణరాశినుండి, "స్వసాన్త్యంత్యధీధర్మసోచ్చాయుస్సుఖపాః" అను సూత్రముచే చెప్పబడినది వివరింపబడెను)

## తాత్కాలిక మిత్రత్వ శత్రుత్వ సమత్వములు

అన్యోన్యస్య ధనవ్యయాయ సహజ వ్యాపార బంధుస్థితా స్తత్కాలే సుహృదస్స్వతుంగభవనే ప్యేకే తయ స్త్వన్యథా।
ద్వ్యేకానుక్త భపాస్తన్యహృత్సమ రిపూ స్తన్నం చింత్య నైసర్గికాం స్తత్కాలేతు పునస్తుతానధి సుహృన్మిత్రాదిభిః కల్పయేత్॥

తా॥ ఒకరికొకరు 2, 12, 11, 3, 10, 4 స్థానములందున్న తాత్కాలిక (జననాదిసమయములందు) మిత్రు లగుదురు. తమ ఉచ్చరాశియందున్న గ్రహము తనకు మిత్రమని కొందరి మతము. చెప్పబడినవాటికంటె నితరస్థానములందున్న గ్రహములు తాత్కాలిక శత్రువులు. తన మూల త్రికోణరాశినుండి 2, 12, 5, 9, 4, 8 ఉచ్చరాశ్యధిపతులు మిత్రులు. ఇతరులు శత్రువులు. రెండులక్షణములున్న గ్రహములు సములు. అను విషయము "స్వసాన్త్యంత్యధీ ధర్మసోచ్చాయుస్సుఖపాః" సూత్రమున గలదు. దీనిచే నను శత్రుమిత్రాదివిచారము పై శ్లోకములలో వివరింపబడినది. దానిచే నను శత్రుత్వాదులు, ఈ శ్లోకముచే నను తాత్కాలిక శత్రుత్వాదులను గమనించి అధిమిత్ర, అధి శత్రుత్వాదికము నిర్ణయింపవలెను. ఎట్లనగా—చెప్పబడిన మిత్రస్థానములందు మిత్రగ్రహమున్న అధి మిత్రము, సముడున్న మిత్రము, శత్రువున్న సముడును అగును. ఇతరములగు శత్రుస్థానములందు మిత్రుడున్న సముడు, సముడున్న శత్రువు, శత్రువున్న అధిశత్రువు నగును.

## బల్లిపాటునకు ఫలములు

శిరస్సు - కలహము, ముఖము - బంధుదర్శనము, కను బొమ్మలనడుమ - రాజానుగ్రహము, పై పెదవి - ధనవ్యయము, క్రింది పెదవి - ధనలాభము, ముక్కుచివర - రోగము, కుడిచెవి - దీర్ఘాయువు, ఎడమచెవి - వర్తకలాభము, నేత్రము - ఖైదు, గడ్డము- రాజదండనము, నోరు - భయము, కంఠము - శత్రుహాని, కుడి భుజము - ఆరోగ్యము, ఎడమభుజము - స్త్రీసంగమము, కుడి ముంజేయి - కీర్తి, ఎడమముంజేయి - రోగము, స్తనయుగ్మము - దోషము, ఉదరము - ధాన్యలాభము, రొమ్ము, నాభి - ధనలాభము, ప్రక్కలు - సుఖము, పాదము - ప్రయాణము, వీపు - శుభము, గోళ్లు - ధనవ్యయము, లింగము - దారిద్ర్యము, జుట్టుకొన - మృత్యువు. ఈ ప్రదేశములయందు తొండ ప్రాకినను ఫలమిట్లే యని తెలియునది.

## పుట్టుమచ్చల ఫలము.

కణతయందు బుట్టుమచ్చ యుండెనేని ఆకస్మిక ధనప్రాప్తి యును ఖ్యాతియును కలుగును. చెక్కిళ్లయందు మచ్చ యుండెనేని స్వల్పధనము గలవాడగును. ముక్కునందు మచ్చ యుండిన తలచినకార్యము లన్నియును సఫలమునొందును. గడ్డమందు మచ్చ యుండిన ధనాతిశయమును కీర్తియును కలుగును.

## కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ—సూర్య దశ సం॥ 6 భుక్తులు-అంతరములు

| భుక్తుల వివరము | నెల | దినం | సూర్యుడు | చంద్రుడు | కుజుడు | రాహు | గురు | శని | బుధుడు | కేతు | శుక్రుడు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| సూర్య | 3 | 18 | సూ 0-5-24 | చం 0-15-0 | కుజ 0-7-21 | రా 1-18-36 | గురు 1-8-24 | శని 1-24-9 | బుధ 1-13-21 | కేతు 0-7-21 | శుక్ర 2-0-0 |
| చంద్ర | 6 | 0 | చం 0-9-0 | కుజ 0-10-30 | రా 0-18-54 | గురు 1-13-12 | శని 1-15-36 | బుధ 1-18-27 | కేతు 0-17-51 | శుక్ర 0-21-0 | సూ 0-18-0 |
| కుజ | 4 | 6 | కుజ 0-16-18 | రా 0-27-0 | గురు 0-16-48 | శని 1-21-18 | బుధ 1-10-48 | కేతు 0-19-57 | శుక్ర 1-21-0 | సూ 0-6-18 | చం 1-0-0 |
| రాహు | 10 | 24 | రా 0-16-12 | గురు 0-24-0 | శని 0-19-57 | బుధ 1-15-54 | కేతు 0-16-47 | శుక్ర 1-27-0 | సూ 0-15-18 | చం 0-10-30 | కుజ 0-21-0 |
| గురు | 9 | 18 | గురు 0-14-24 | శని 0-28-30 | బుధ 0-17-51 | కేతు 0-18-54 | శుక్ర 1-18-0 | సూ 0-17-6 | చం 0-25-30 | కుజ 0-7-21 | రా 1-24-0 |
| శని | 11 | 12 | శని 0-17-6 | బుధ 0-25-30 | కేతు 0-7-21 | శు 1-24-0 | సూ 0-14-24 | చం 0-28-30 | కుజ 0-17-51 | రా 0-18-54 | గురు 1-18-0 |
| బుధ | 10 | 6 | బుధ 0-15-18 | కేతు 0-10-30 | శు 0-21-0 | సూ 0-16-12 | చం 0-24-0 | కుజ 0-19-57 | రా 1-15-54 | గురు 0-16-48 | శని 1-27-0 |
| కేతు | 4 | 6 | కేతు 0-6-18 | శు 1-0-0 | సూ 0-6-18 | చం 0-27-0 | కుజ 0-16-48 | రా 1-21-18 | గురు 1-10-48 | శని 0-19-57 | బుధ 1-21-0 |
| శుక్ర | 12 | 0 | శు 0-18-0 | సూ 0-9-0 | చం 0-10-30 | కుజ 0-18-54 | రా 1-13-12 | గురు 1-15-36 | శని 1-18-27 | బుధ 0-17-51 | కేతు 0-21-0 |
| మొ॥ స॥ | 6 | 0 0 | 8-18-0 | 6-0-0 | 4-6-0 | 10-24-0 | 9-18-0 | 11-12-0 | 10-6-0 | 4-6-0 | 12-0-0 |

## రోహిణి, హస్త, శ్రవణం—చంద్ర దశ సం॥ 10 భుక్తులు-అంతరములు

| భుక్తుల వివరము | నెల | దినం | చంద్రుడు | కుజుడు | రాహు | గురు | శని | బుధుడు | కేతు | శుక్రుడు | సూర్యుడు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| చంద్రుడు | 10 | 0 | చం 0-25-0 | కుజ 0-12-15 | రా 2-21-0 | గురు 2-4-0 | శని 3-0-15 | బుధ 2-12-15 | కేతు 0-12-15 | శుక్ర 3-10-0 | సూ 0-9-0 |
| కుజుడు | 7 | 0 | కుజ 0-17-30 | రా 1-1-30 | గురు 2-12-0 | శని 2-16-0 | బుధ 2-20-45 | కేతు 0-29-45 | శుక్ర 1-5-0 | సూ 1-0-0 | చం 0-15-0 |
| రాహువు | 18 | 0 | రా 1-15-0 | గురు 0-28-0 | శని 2-25-30 | బుధ 2-8-0 | కేతు 1-3-15 | శుక్ర 2-25-0 | సూ 0-10-30 | చం 1-20-0 | కుజ 0-10-30 |
| గురు | 16 | 0 | గురు 1-10-0 | శని 1-3-15 | బుధ 2-16-30 | కేతు 0-28-0 | శుక్ర 3-5-0 | సూ 0-25-30 | చం 0-17-30 | కుజ 1-5-0 | రా 0-27-0 |
| శని | 19 | 0 | శని 1-17-30 | బుధ 0-29-45 | కేతు 1-1-30 | శుక్ర 2-20-0 | సూ 0-28-30 | చం 1-12-30 | కుజ 0-12-15 | రా 3-0-0 | గురు 0-24-0 |
| బుధుడు | 17 | 0 | బుధ 1-22-30 | కేతు 0-12-15 | శుక్ర 3-0-0 | సూ 0-24-0 | చం 1-17-30 | కుజ 0-29-45 | రా 1-1-30 | గురు 2-20-0 | శని 0-33-30 |
| కేతు | 7 | 0 | కేతు 0-17-30 | శుక్ర 1-5-0 | సూ 0-27-0 | చం 1-10-0 | కుజ 1-3-15 | రా 2-16-20 | గురు 0-28-0 | శని 3-5-0 | బుధ 0-35-30 |
| శుక్రుడు | 20 | 0 | శుక్ర 1-20-0 | సూ 0-10-30 | చం 1-15-0 | కుజ 0-28-0 | రా 2-25-30 | గురు 2-8-0 | శని 1-3-15 | బుధ 2-25-0 | కేతు 0-10-30 |
| సూర్యుడు | 6 | 0 | సూ 0-15-0 | చం 0-17-30 | కుజ 1-1-30 | రా 2-12-0 | గురు 2-16-0 | శని 2-20-45 | బుధ 0-29-45 | కేతు 1-5-0 | శుక్ర 1-0-0 |
| మొ॥ సం॥ | 10 | 0 0 | 10-0-0 | 7-0-0 | 18-0-0 | 16-0-0 | 19-0-0 | 17-0-0 | 7-0-0 | 20-0-0 | 6-0-0 |

## మృగశిర, చిత్త, ధనిష్ఠ—కుజ దశ సం॥ 7 భుక్తులు-అంతరములు

| భుక్తుల వివరము | నెల | దినం | కుజుడు | రాహు | గురు | శని | బుధుడు | కేతు | శుక్రుడు | సూర్యుడు | చంద్రుడు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| కుజుడు | 4 | 27 | కుజ 0-8-34½ | రా 1-26-42 | గురు 1-14-48 | శని 2-3-10½ | బుధ 1-20-34½ | కేతు 0-8-34½ | శుక్ర 2-10-0 | సూ 0-6-18 | చం 0-17-30 |
| రాహు | 12 | 18 | రా 0-22-3 | గురు 1-20-24 | శని 1-23-12 | బుధ 1-26-31½ | కేతు 0-20-49½ | శుక్ర 0-24-30½ | సూ 0-21-0 | చం 0-10-30 | కుజ 0-12-15 |
| గురు | 11 | 6 | గురు 0-19-36 | శని 1-29-51 | బుధ 1-17-36 | కేతు 0-23-16½ | శుక్ర 1-29-30 | సూ 0-7-21 | చం 1-5-0 | కుజ 0-7-21 | రా 1-1-30 |
| శని | 13 | 9 | చం 0-23-16½ | బుధ 1-23-33 | కేతు 0-19-36 | శుక్ర 2-6-30 | సూ 0-17-51 | చం 0-12-15 | కుజ 0-24-30 | రా 0-18-54 | గురు 0-28-0 |
| బుధుడు | 11 | 27 | బుధ 0-20-49½ | కేతు 0-22-3 | శుక్ర 1-26-0 | సూ 0-19-57 | చం 0-29-45 | కుజ 0-8-34½ | రా 2-3-0 | గురు 0-16-48 | శని 1-3-15 |
| కేతు | 4 | 27 | కేతు 0-8-34½ | శుక్ర 2-3-0 | సూ 0-16-48 | చం 1-3-15 | కుజ 0-20-49½ | రా 0-22-3 | గురు 1-26-0 | శని 0-19-57 | బుధ 0-29-45 |
| శుక్ర | 1 | 2 | శుక్ర 0-24-30 | సూ 0-18-54 | చం 0-28-0 | కుజ 0-23-16½ | రా 1-23-33 | గురు 0-19-36 | శని 2-6-30 | బుధ 0-17-51 | కేతు 0-12-15 |
| సూర్యుడు | 4 | 6 | సూ 0-7-21 | చం 1-1-30 | కుజ 0-19-36 | రా 1-29-51 | గురు 1-17-36 | శని 0-23-16½ | బుధ 1-29-30 | కేతు 0-7-21 | శుక్ర 1-5-0 |
| చంద్రుడు | 7 | 0 | చం 0-12-15 | కుజ 0-22-3 | రా 1-20-24 | గురు 1-23-12 | శని 1-26-31½ | బుధ 0-20-49½ | కేతు 0-24-30 | శుక్ర 0-21-0 | సూ 0-10-30 |
| మొ॥ సం॥ | 7 | 0 0 | 4-27-0 | 12-18-0 | 11-6-0 | 18-9-0 | 11-27-0 | 4-27-0 | 14-0-0 | 4-6-0 | 7-0-0 |

## అర్ద్ర, స్వాతి, శతభిషం—రాహు దశ సం॥ 18 భుక్తులు-అంతరములు

| భుక్తులు వివరము | నెల దినం | రాహువు | గురుడు | శని | బుధుడు | కేతు | శుక్రుడు | సూర్యుడు | చంద్రుడు | కుజుడు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| రాహు | 32 12 | రా 4-25-48 | గురు 3-25-12 | శని 5-12-27 | బుధ 4-10-3 | కేతు 0-23-3 | శుక్ర 6-0-0 | సూ 0-16-12 | చం 1-15-0 | కుజ 0-23-3 |
| గురు | 28 24 | గురు 4-9-36 | శని 4-16-48 | బుధ 4-25-21 | కేతు 1-23-33 | శుక్ర 2-3-0 | సూ 1-24-0 | చం 0-27-0 | కుజ 1-1-50 | రా 1-26-42 |
| శని | 34 6 | శని 5-3-54 | బుధ 4-2-14 | కేతు 1-29-51 | శుక్ర 5-3-0 | సూ 0-18-54 | చం 3-0-0 | కుజ 0-18-54 | రా 2-21-0 | గురు 1-20-24 |
| బుధుడు | 30 18 | బుధ 4-17-42 | కేతు 1-20-24 | శుక్ర 5-21-0 | సూ 1-15-54 | చం 1-1-30 | కుజ 2-3-0 | రా 1-18-36 | గురు 2-12-0 | శని 1-29-51 |
| కేతు | 12 18 | కేతు 1-26-42 | శుక్ర 4-24-0 | సూ 1-21-18 | చం 2-16-30 | కుజ 0-22-3 | రా 5-12-0 | గురు 1-13-12 | శని 2-25-30 | బుధ 1-23-33 |
| శుక్ర | 36 0 | శుక్ర 5-12-0 | సూ 1-13-12 | చం 2-25-30 | కుజ 1-23-33 | రా 1-26-42 | గురు 4-24-0 | శని 1-21-18 | బుధ 2-16-30 | కేతు 0-22-3 |
| సూర్య | 10 24 | సూ 1-18-36 | చం 3-12-0 | కుజ 1-29-51 | రా 4-17-42 | గురు 1-20-24 | శని 5-21-0 | బుధ 1-15-54 | కేతు 1-1-30 | శుక్ర 2-3-0 |
| చంద్ర | 18 0 | చం 2-21-0 | కుజ 1-20-24 | రా 5-3-54 | గురు 4-2-24 | శని 1-29-51 | బుధ 5-3-0 | కేతు 0-18-54 | శుక్ర 3-0-0 | సూ 0-18-54 |
| కుజ | 12 18 | కుజ 1-26-42 | రా 4-9-36 | గురు 4-16-48 | శని 4-25-21 | బుధ 1-23-33 | కేతు 2-3-0 | శుక్ర 1-24-0 | సూ 0-27-0 | చం 1-1-30 |
| మొ॥ సం॥ | 18 0 0 | 32-12-0 | 28-24-0 | 34-6-0 | 30-18-0 | 12-18-0 | 36-0-0 | 10-24-0 | 18-0-0 | 12-18-0 |

## పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర—గురు దశ సం॥ 16 భుక్తులు-అంతరములు

| భుక్తులు వివరము | నెల దినం | గురుడు | శని | బుధుడు | కేతు | శుక్రుడు | సూర్యుడు | చంద్రుడు | కుజుడు | రాహు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| గురు | 25 18 | గురు 3-12-24 | శని 4-24-24 | బుధ 3-25-36 | కేతు 0-19-36 | శుక్ర 5-10-0 | సూ 0-14-24 | చం 1-10-0 | కుజ 0-19-36 | రా 4-9-16 |
| శని | 30 12 | శని 4-1-36 | బుధ 4-9-12 | కేతు 1-17-36 | శుక్ర 1-26-0 | సూ 1-18-0 | చం 0-24-0 | కుజ 0-28-0 | రా 1-10-24 | గురు 3-25-42 |
| బుధ | 27 6 | బుధ 3-18-4 | కేతు 1-28-12 | శుక్ర 4-16-0 | సూ 0-16-48 | చం 2-20-0 | కుజ 0-16-48 | రా 2-12-0 | గురు 1-14-4 | శని 4-16-28 |
| కేతు | 11 6 | కేతు 1-14-48 | శుక్ర 5-2-0 | సూ 1-10-4 | చం 0-28-0 | కుజ 1-26-0 | రా 1-13-12 | గురు 2-4-0 | శని 1-23-12 | బుధ 4-2-34 |
| శుక్ర | 32 0 | శుక్ర 4-8-0 | సూ 1-15-36 | చం 2-8-0 | కుజ 0-19-36 | రా 4-24-0 | గురు 1-8-24 | శని 2-16-0 | బుధ 1-17-36 | కేతు 1-20-24 |
| సూర్య | 9 18 | సూ 1-8-24 | చం 2-16-0 | కుజ 1-17-36 | రా 1-20-24 | గురు 4-8-0 | శని 1-15-36 | బుధ 3-8-0 | కేతు 0-19-36 | శుక్ర 4-24-0 |
| చంద్ర | 16 0 | చం 2-4-0 | కుజ 1-23-12 | రా 4-2-24 | గురు 1-14-48 | శని 5-2-0 | బుధ 1-10-9 | కేతు 0-28-0 | శుక్ర 1-26-0 | సూ 1-13-12 |
| కుజ | 11 6 | కుజ 1-14-4 | రా 4-16-48 | గురు 3-18-48 | శని 1-23-12 | బుధ 4-16-0 | కేతు 0-16-48 | శుక్ర 0-20-0 | సూ 0-16-48 | చం 2-12-0 |
| రాహు | 28 24 | రా 3-25-12 | గురు 4-1-36 | శని 4-9-12 | బుధ 1-17-36 | కేతు 1-26-0 | శుక్ర 1-18-0 | సూ 0-24-0 | చం 0-28-0 | కుజ 1-20-24 |
| మొ॥ సం॥ | 16 0 0 | 25-18-0 | 30-12-0 | 27-6-0 | 11-6-0 | 32-0-0 | 9-18-0 | 16-0-0 | 11-6-0 | 28-24-0 |

## పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర—శని దశ సం॥ 19 భుక్తులు-అంతరములు

| భుక్తులు వివరము | నెల దినం | శని | బుధుడు | కేతు | శుక్రుడు | సూర్యుడు | చంద్రుడు | కుజుడు | రాహు | గురుడు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| శని | 36 3 | శని 5-21-28½ | బుధ 4-17-16½ | కేతు 0-28-16½ | శుక్ర 6-10-0 | సూ 0-17-6 | చం 1-17-30 | కుజ 0-23-16½ | రా 5-3-54 | గురు 4-1-36 |
| బుధుడు | 32 9 | బుధ 5-3-25½ | కేతు 1-26-31½ | శుక్ర 2-6-30 | సూ 1-27-0 | చం 0-28-30 | కుజ 1-3-15 | రా 1-29-51 | గురు 4-16-48 | శని 4.24-24 |
| కేతు | 13 9 | కేతు 2-3-10½ | శుక్ర 5-11-30 | సూ 0-19-57 | చం 3-5-0 | కుజ 0-19-57 | రా 2-26-30 | గురు 1-23-12 | శని 5-12-27 | బుధ 4-9-12 |
| శుక్ర | 38 0 | శుక్ర 6-0-30 | సూ 1-18-27 | చం 1-3-15 | కుజ 2-6-30 | రా 1-21-18 | గురు 2-16-0 | శని 2-3-10½ | బుధ 4-25-21 | కేతు 1-23-12 |
| సూర్య | 11 12 | సూ 1-24-9 | చం 2-20-45 | కుజ 0-23-16 | రా 5-21-0 | గురు 1-15-36 | శని 3-0-15 | బుధ 1-26-31½ | కేతు 1-29-51 | శుక్ర 5-2-0 |
| చంద్ర | 19 0 | చం 3-0-15 | కుజ 1-26-31½ | రా 1-29-51 | గురు 5-2-0 | శని 1-24-9 | బుధ 2-20-45 | కేతు 0-23-16½ | శుక్ర 5-21-0 | సూ 1-15-36 |
| కుజ | 13 9 | కుజ 2-3-10½ | రా 4-25-21 | గురు 1-23-12 | శని 6-0-20 | బుధ 1-18-27 | కేతు 1-3-15 | శుక్ర 2-6-30 | సూ 1-21-18 | చం 2-16-0 |
| రాహు | 34 6 | రా 5-12-27 | గురు 4-9-12 | శని 2-3-10½ | బుధ 5-11-30 | కేతు 0-19-57 | శుక్ర 3-5-0 | సూ 0-19-57 | చం 2-25-30 | కుజ 1-23-12 |
| గురు | 30 12 | గురు 4-24-24 | శని 5-3-25½ | బుధ 1-26-31½ | కేతు 2-6-30 | శుక్ర 1-27-0 | సూ 0-28-30 | చం 1-3-15 | కుజ 1-29.51 | రా 4-16-48 |
| మొ॥ సం॥ | 19 0 0 | 36-3-0 | 32-9-0 | 13-9-0 | 38-0-0 | 11-12-0 | 19-0-0 | 13-9-0 | 34-6-0 | 30-12-0 |

## ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి—బుధ దశ సం॥ 17 భుక్తులు-అంతరములు

| భుక్తులు వివరము | నెల | దినం | బుధుడు | కేతు | శుక్రుడు | సూర్యుడు | చంద్రుడు | కుజుడు | రాహు | గురు | శని |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| బుధ | 28 | 27 | బుధ 4-2-49½ | కేతు 0-20-49½ | శుక్ర 5-20-0 | సూ 0-15-18 | చం 1-12-30 | కుజ 0-20-49½ | రా 4-17-42 | గురు 3-18-48 | శని 5-3-25½ |
| కేతు | 11 | 27 | కేతు 1-20-34½ | శుక్ర 1-29-30 | సూ 1-21-0 | చం 0-25-30 | కుజ 0-29-45 | రా 1-23-33 | గురు 4-2-24 | శని 4-9-12 | బుధ 4-17-16½ |
| శుక్ర | 34 | 0 | శుక్ర 4-24-30 | సూ 0-17-51 | చం 2-25-0 | కుజ 0-17-51 | రా 2-16-30 | గురు 1-17-36 | శని 4-25-21 | బుధ 3-25-36 | కేతు 1-26-31½ |
| సూర్య | 10 | 6 | సూ 1-13-21 | చం 0-29-45 | కుజ 1-29-30 | రా 1-15-54 | గురు 2-8-0 | శని 1-26-31½ | బుధ 4-10-3 | కేతు 1-17-36 | శుక్ర 5-11-30 |
| చంద్ర | 17 | 0 | చం 2-12-15 | కుజ 0-20-49½ | రా 5-3-0 | గురు 1-10-48 | శని 2-20-45 | బుధ 1-20-34½ | కేతు 1-23-33 | శుక్ర 4-16-0 | సూ 1-18-27 |
| కుజ | 11 | 27 | కుజ 1-20-34½ | రా 1-23-33 | గురు 4-16-0 | శని 1-18-27 | బుధ 2-12-15 | కేతు 0-20-49½ | శుక్ర 5-3-0 | సూ 1-10-48 | చం 2-20-45 |
| రాహు | 30 | 18 | రా 4-10-3 | గురు 1-17-36 | శని 5-11-30 | బుధ 1-13-21 | కేతు 0-29-45 | శుక్ర 1-29-30 | సూ 1-15-54 | చం 2-8-0 | కుజ 1-26-31½ |
| గురు | 27 | 6 | గురు 3-25-36 | శని 1-26-31½ | బుధ 4-24-30 | కేతు 0-17-51 | శుక్ర 2-25-0 | సూ 0-17-51 | చం 2-16-30 | కుజ 1-17-36 | రా 4-25-21 |
| శని | 32 | 9 | శని 4-17-16½ | బుధ 1-20-34½ | కేతు 1-29-30 | శుక్ర 1-21-0 | సూ 0-25-30 | చం 0-29-45 | కుజ 1-23-33 | రా 4-2-24 | గురు 4-9-12 |
| మొ॥ సం॥ | 17 0 0 | | 28-27 0 | 11-27-0 | 34-0-0 | 10-6-0 | 17-0-0 | 11-27-0 | 30-18-0 | 27-6-0 | 32-9-0 |

## అశ్విని, మఖ, మూల—కేతు దశ సం॥ 7 భుక్తులు-అంతరములు

| భుక్తులు వివరము | నెల | దినం | కేతు | శుక్రుడు | సూర్యుడు | చంద్రుడు | కుజుడు | రాహువు | గురుడు | శని | బుధుడు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| కేతు | 4 | 27 | కేతు 0-8-34½ | శుక్ర 2-10-0 | సూ 0-6-18 | చం 0-17-30 | కుజ 0-8-34½ | రా 1-26-42 | గురు 1-14-48 | శని 2-3-10½ | బు 1-20-34½ |
| శుక్ర | 14 | 0 | శుక్ర 0-24-30 | సూ 0-21-0 | చం 0-10-30 | కుజ 0-12-15 | రా 0-22-3 | గురు 1-20-24 | శని 1-23-12 | బుధ 1-26-31½ | కేతు 0-20-49½ |
| సూర్య | 4 | 6 | సూ 0-7-21 | చం 1-5-0 | కుజ 0-7-21 | రా 1-1-30 | గురు 0-19-36 | శని 1-29-51 | బుధ 1-17-36 | కేతు 0-23-16½ | శుక్ర 1-29-30 |
| చంద్ర | 7 | 0 | చం 0-12-15 | కుజ 0-24-30 | రా 0-18-54 | గురు 0-28-0 | శని 0-23-16½ | బుధ 1-23-33 | కేతు 0-19-36 | శుక్ర 2-6-30 | సూ 0-17-51 |
| కుజ | 4 | 27 | కుజ 0-8-34½ | రా 2-3-0 | గురు 0-16-48 | శని 1-3-15 | బుధ 0-20-48½ | కేతు 0-22-0 | శుక్ర 1-26-0 | సూ 0-19-57 | చం 0-29-45 |
| రాహు | 12 | 18 | రా 0-22-3 | గురు 1-26-0 | శని 0-19-57 | బుధ 0-29-45 | కేతు 0-8-34½ | శుక్ర 2-3-4 | సూ 0-16-48 | చం 1-3-15 | కుజ 0-20-49½ |
| గురు | 11 | 6 | గురు 0-19-36 | శని 2-6-30 | బుధ 0-17-51 | కేతు 0-12-15 | శుక్ర 0-24-30 | సూ 0-18-53 | చం 0-28-0 | కుజ 0-23-16½ | రా 1-23-33 |
| శని | 13 | 9 | శని 0-23-16½ | బుధ 1-29-30 | కేతు 0-7-21 | శుక్ర 1-5-0 | సూ 0-7-21 | చం 1-1-30 | కుజ 0.19.36 | రా 1-29-51 | గురు 1-17-36 |
| బుధ | 11 | 27 | బుధ 0-20-49½ | కేతు 0-24-30 | శుక్ర 0-21-0 | సూ 0-10-30 | చం 0-12-15 | కుజ 0-22-3 | రా 1-20-24 | గురు 1-23-12 | శని 1-26-31½ |
| మొ॥ సం॥ | 7 0 0 | | 4-27-0 | 14-0-0 | 4-6-0 | 7-0-0 | 4-27-0 | 12-18-0 | 11-6-0 | 13-9-0 | 11-27 0 |

## భరణి, పుబ్బ, పూర్వాషాఢ—శుక్ర దశ సం॥ 20 భుక్తులు-అంతరములు

| భుక్తులు వివరము | నెల | దినం | శుక్రుడు | సూర్యుడు | చంద్రుడు | కుజుడు | రాహు | గురుడు | శని | బుధుడు | కేతు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| శుక్ర | 40 | 0 | శుక్ర 6-20-0 | సూ 0-18-0 | చం 1-20-0 | కుజ 0-24-30 | రా 5-12-0 | గురు 4-8-0 | శని 6-0-30 | బుధ 4-24-30 | కేతు 0-24-30 |
| సూర్య | 12 | 0 | సూ 2-0-0 | చం 1-0-0 | కుజ 1-5-0 | రా 2-3-0 | గురు 4-24-0 | శని 5-2-0 | బుధ 5-11-30 | కేతు 1-29-30 | శుక్ర 2-10-0 |
| చంద్రుడు | 20 | 0 | చం 3-10-0 | కుజ 0.21-0 | రా 3-0-0 | గురు 1-26-0 | శని 5-21-0 | బుధ 4-16-0 | కేతు 2-6-30 | శుక్ర 5-20-0 | సూ 0-21-0 |
| కుజుడు | 14 | 0 | కుజ 2-10-0 | రా 1-24-0 | గురు 2-20-0 | శని 2-6-30 | బుధ 5-3-0 | కేతు 1-26-0 | శుక్ర 6-10-0 | సూ 1-21-0 | చం 1-5-0 |
| రాహు | 36 | 0 | రా 6-0-0 | గురు 1-18-0 | శని 3-5-0 | బుధ 1-29-30 | కేతు 2-3-0 | శుక్ర 5-10-0 | సూ 1-27-0 | చం 2-25-0 | కుజ 0-24-30 |
| గురు | 32 | 0 | గురు 5-10-0 | శని 1-27-0 | బుధ 2-25-0 | కేతు 0-24-30 | శుక్ర 6-0-0 | సూ 1-18-0 | చం 3-5-0 | కుజ 1-29-30 | రా 2-3-0 |
| శని | 38 | 0 | శని 6-10-0 | బుధ 1.21-0 | కేతు 1-5-0 | శుక్ర 2-10-0 | సూ 1-24-0 | చం 2-20-0 | కుజ 2-6-30 | రా 5-3-0 | గురు 1-26-0 |
| బుధుడు | 34 | 0 | బుధ 5-20-0 | కేతు 0-21-0 | శుక్ర 3-10-0 | సూ 0-21-0 | చం 3-0-0 | కుజ 1-26-0 | రా 5-21-0 | గురు 4-16-0 | శని 2-6-30 |
| కేతు | 14 | 0 | కేతు 2-10-0 | శుక్ర 2-0-1 | సూ 1-0-0 | చం 1-5-0 | కుజ 2-3-0 | రా 4-24-0 | గురు 5-2-0 | శని 5-11-30 | బుధ 1-29-30 |
| మొ॥ సం॥ | 20 0 0 | | 40-0-0 | 12-0-0 | 20-0-0 | 14-0-0 | 36-0-0 | 32-0-0 | 38-0-0 | 34-0-0 | 14-0-0 |